Recommended for use in all the public libraries and school libraries by the Director of Public Libraries, Andhra State, Madras, vide Proceedings Dis No 50 55 dated 6th January 1955

---



డాక్టర్ శ్రీ బి రామకృష్ణరావు,
ఉపాధ్యక్షులు
ద భా హిందీ ప్రచార సభ



శ్రీ సి. రాజగోపాలాచార్యులు,
ఉపాధ్యక్షులు
ద. భా. హిందీ ప్రచార సభ

## ఈ సంచికలో


1 సంపాదకీయం

2 వార్ధకము (కవిత)

శ్రీమదాచార్య రఘునాథ చక్రవర్తి

3 హిందీ సాహిత్యం - పూర్వ మధ్యయుగము (వ్యాసం)

డాక్టర్ ఆర్యేంద్ర శర్మ యం. ఏ

4 మార్కండేయ పురాణములు - మనుచరిత్రము (వ్యాసం)

శ్రీ వల్లా దుర్గయ్య. యం ఏ.

5 హంవయ్య (కవిత)

శ్రీ శ్రీ అల్లసాని రామనాథశర్మ, అష్టావధాని.

6 కాళిదాసు కవి సందర్శనము (ఏకాంకిక)

శ్రీ కి రా

7 సంధ్యారవము (కవిత)

శ్రీ వెల్లూరి శ్రీనివాసమూర్తి

8 గీతార్థము (వ్యాసం)

శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యులు, యం, ఏ

9 అవ్యక్తవేదన (గేయం)

శ్రీ పెండ్యాల చినరాఘవరావు '[illegible]'

10 పుస్తక పరిచయం

11 ప్రేమతత్వం (గేయం)

శ్రీ జయంతి

12 హైదరాబాదు హిందీ ప్రచార సంఘం సర్వసభ్య [illegible]



[illegible]
అజంతా ప్రింటర్సు, సికింద్రాబాదు.

# హైదరాబాదు హిందీ ప్రచార సంఘం స్వతంత్ర ప్రతిపత్తి

దాదాపు 1928 సంవత్సరం నుండే హైద్రాబాదులో హిందీ ప్రచారం జరుగుతున్నది. అనాటినుండి దక్షిణ భారత హిందీ ప్రచారసభ యాజమాన్యాన స్టేటులో పరీక్ష కేంద్రాలు, హిందీ ప్రేమీ మండలులు ఏర్పడి నిర్విరామంగా హిందీ వ్యాప్తికి కృషి చేస్తున్నవి. అప్పటి హైదరాబాదు ప్రభుత్వము హిందీ భాషయెడల సద్భావాన్ని చూపించక పోగా పైపెచ్చు ఈ ఉద్యమాన్ని అణచివేయడానికి గూడా విశ్వ ప్రయత్నం చేసింది. ప్రభుత్వానికి నచ్చ చెప్పడానికి హిందీ ప్రచారాన్ని అభివృద్ధి చేయడానికి 1935 వ సంవత్సరంలో హైదరాబాదు రాజ్య హిందీ ప్రచార సభ ఏర్పడింది. 1941 - 42 సంవత్సరం వరకు రాజ్య హిందీ ప్రచార సభ దక్షిణ భారత హిందీ ప్రచార సభతోనే కలసి ఉన్నది. తరువాత ఆ సభ దక్షిణ భారత హిందీ ప్రచార సభతో సహకరించడం వదలివేసింది

మహాత్మాజీ హిందీ సాహిత్య సమ్మేళనంతో తెగతెంపులు చేసుకోవడం, దక్షిణ భారత హిందీ ప్రచారసభ మహాత్మాజీతోనే ఉండిపోవడం అందరికీ తెలిసిన విషయమే. రాజ్య హిందీ ప్రచారసభ దక్షిణ భారత హిందీ సభతో సహకరించకుండా ఉండడానికి ఇది ఒక కారణంగా చెప్పబడింది 1941 వ సంవత్సరం తరువాత దాదాపు ఐదారు సంవత్సరాలు క్విట్ ఇండియా ఉద్యమం మన దేశంలో ముమ్మరంగా జరగడం వల్లనూ, దక్షిణ భారత హిందీ ప్రచారసభ ప్రధాన కార్యదర్శి మొదలగువారు కారాగారంలో ఉండడం వల్లనూ భారత రాజ్యాంగ సభలో హిందీ భాష స్వరూప నిర్వచనం జరుగుతూ ఉండడం వల్లనూ హైదరాబాదులో విరివిగా పని చేయడానికి అవకాశం కలుగలేదు. 1949 వ సంవత్సరంనుండి వరంగల్లులో హిందీ విశారద విద్యాలయాన్ని నెలకొల్పి దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఆంధ్రశాఖ తిరిగి పని ప్రారంభించింది. 1951 లో హైదరాబాదులో హిందీ ప్రచార సంఘం స్థాపించబడింది. హైద్రాబాదు త్రిభాషాప్రాంతం కావడం వలన ఈ రాష్ట్రంలో హిందీ ప్రచార కార్యాన్ని నిర్వహించే పూర్తిబాధ్యతను ఆంధ్ర శాఖనుండి తొలగించి కేంద్రసభ తన మీద పెట్టుకొన్నది. తత్ఫలితంగా 1952 లో శ్రీ స్వామీ రామానంద తీర్థగారు అధ్యక్షులుగను, శ్రీ డాక్టర్ జి. యస్. మేలుకోటే, యం. చెన్నారెడ్డి గారలు ఉపాధ్యక్షులుగను, శ్రీ ఆంజనేయ శర్మగారు కార్యదర్శిగను అడ్ హాక్ కమిటీ ఏర్పాటు చేయబడింది. ఈ అడ్ హాక్ కమిటీ ద్విగుణీకృతోత్సాహంతో రెండు మూడు సంవత్సరాలలోనే ప్రశంసనీయంగా పనిచేసింది. గడిచిన మే నెల 22 వ తేదీ సాయంత్రం సంఘసర్వసభ్య సమావేశం జరిగి నూతన కార్యనిర్వాహక వర్గం ఎన్నుకొనబడింది. దీనితో హిందీ ప్రచార సంఘానికి సంపూర్ణమైన స్వతంత్ర ప్రతిపత్తి లభించింది. నూతన కార్యవర్గ సభ్యులకు మా హృదయ పూర్వకమైన స్వాగతాన్ని తెలియ జేస్తున్నాము. ఈ సంస్థకు స్వతంత్ర ప్రతిపత్తిని కల్పించడంలోనూ, ఎప్పటి కప్పుడు కార్య నిర్వాహణలోనూ సహాయపడుతున్న కేంద్ర సభ ప్రధాన కార్యదర్శి శ్రీ మోటూరి సత్యనారాయణగారికి మా కృతజ్ఞతను తెలియజేస్తున్నాము. హైద్రాబాదులోని ప్రజలూ, నాయకులూ ఈ సంస్థకు అన్ని విధాలా సహకరించ గలరని విశ్వసిస్తున్నాము. ఆర్థికంగా ఈ సంస్థకు సహాయం చేస్తున్న హైద్రాబాదు ప్రభుత్వం వారికి మా ధన్యవాదాలను సమర్పిస్తున్నాము.

సంవత్సర చందా
రు. 2-0-0

విడిప్రతి
రు. 0-4-0

# స్రవంతి

| సంపుటి ౨ | జ్యేష్ఠము, మన్మథ సంవత్సరము | సంచిక 3 |
|---|---|---|

*సంపాదకీయం :*

## హిందీ కమీషన్

భారత రాజ్యాంగ చట్టం అంగీకరించబడి ఐదు సంవత్సరాలు పూర్తి అయినవి. రాజ్యాంగ చట్టంలోని 344 వ సూత్రాన్ని అనుసరించి రాష్ట్రపతి హిందీ కమీషనును నియమించవలసి ఉన్నది. 344 వ సూత్రంలో " రాష్ట్రపతి ఈ సంవిధాన ప్రారంభమునుండి అయిదు సంవత్సరములు గతించినపుడును, అటుపిమ్మట పది సంవత్సరములు గతించినప్పుడును, ఆయన నియుక్తిచేయు సభాపతితోను, మరియు ఎనిమిదవ అనుసూచిలో నిర్దిష్టమైన వివిధ భాషలకు ప్రాతినిధ్యము వహించునట్టి ఇతర సదస్యులతోను కూడియున్న కమీషనును నియుక్తి చేయవచ్చును" అని ఉన్నది.

ఈ కమీషన్‌వారు దేశమంతటా పర్యటన చేసి ఈ క్రింది విషయములపై ఒక నివేదికను తయారుచేసి రాష్ట్రపతికి సమర్పించవలసియున్నది.

1. కేంద్రీయ సంఘప్రభుత్వ ప్రయోజనముల నిమిత్తము క్రమేపి హిందీ భాషను ఉపయోగించుట.

2. సంఘ ప్రభుత్వ ప్రయోజనము లన్నింటికి గానీ లేక వాటిలో దేనికైన గానీ ఇంగ్లీషు భాషను ఉపయోగించుట.

3. 348 వ సూత్రంలో పేర్కొనబడిన ప్రయోజనములన్నిటికి గానీ వాటిలో దేనికైన గానీ ప్రయోగింపబడ వలసిన భాష.

4. సంఘ నిర్దిష్టములైన ప్రయోజనములకొరకు ఉపయోగింప బడవలసిన అంకెలు.

5. సంఘముయొక్క రాజభాష విషయంలోనూ, ఒక ప్రాంతీయ ప్రభుత్వంవారు ఇంకొక ప్రాంతీయ ప్రభుత్వంతో ఉత్తర ప్రత్యుత్తరాలు జరుపవలసి వచ్చినప్పుడును ఉపయోగించ బడవలసిన భాష."

ఈ కమీషనులో ఎనిమిదవ అనుసూచిలో నిర్దిష్టములైన 14 భాషల ప్రతినిధులు ఉండవలెనని 344 వ సూత్రం నిర్దేశిస్తున్నది. ఆ 14 భాషలలో హిందీకూడా ఒకటి. రాష్ట్రపతి

ప్రఖ్యాత విద్యావేత్త అయిన శ్రీ ఖేర్‌గారిని కమీషనుకు అధ్యక్షులుగా నియమించినారు. ఇది చాలా సంతోషకరమైన విషయం. కాని మిగిలిన సభ్యులపేర్లు ఇంతవరకు ప్రచురణ కాలేదు. ఈ పేర్ల విషయంలో శ్రీ టాండన్‌గారి నాయకత్వాన హిందీ సాహిత్య సమ్మేళనం వారు కొంత గందరగోళం చేస్తున్నట్లు తెలుస్తున్నది. 344 సూత్రంలో ఏ భాషకు ఎంతమంది సభ్యులు ఉండవలెననేది స్పష్టంగా లేదుగనుక హిందీవారికి ఆ కమీషన్‌లో సగమైనా స్థానాలు కావలెనని టాండన్‌గారు వాదిస్తున్నారు. అనేక సమావేశాలు జరిపించి కేంద్ర ప్రభుత్వంమీద ఒత్తిడిని తెస్తున్నారు. ఈ విషయంలో కేంద్ర విద్యాశాఖకూ, హోమ్ శాఖకూ అభిప్రాయ భేదంగూడా వచ్చినట్లు తెలుస్తున్నది. 344 వ సూత్రాన్ని చదివితే కమీషను సభ్యులలో అన్ని భాషలవారికి సమానమైన ప్రాతినిధ్యం ఉండవలెనని ప్రతివానికీ బోధ పడుతున్నది. హిందీవారికి అందరితోబాటు ప్రాతినిధ్యం యిస్తే సరిపోదట. వారికి ఎక్కువ ప్రాతినిధ్యం కావలెనట !! దేనికో ఆ ప్రాతినిధ్యం !!! ఈ అతివాద ధోరణిని చూచి రాష్ట్రపతి గూడా విసుగు చెందుతున్నట్లు తెలుస్తున్నది. మొత్తంమీద హిందీ అతివాదులదృష్టి మారినట్లు కనపడదం లేదు. వారిదృష్టి మారనంతకాలం ఇతర భాషలవారిలో సందేహం పెరగక మానదు. ఈ సందేహం పెరిగినకొద్దీ రాజభాషయెడల ప్రజలలో ఏవగింపుగూడా పెరుగు తుంది. నిజానికి దక్షిణదేశంలోని నాయకులూ, ప్రజలూ ఎంతో ఉదారంగా వ్యవహరించి ఆప్యాయతతో హిందీని నేర్చుకొంటున్నారు. అహిందీ ప్రాంతాలలో అనేక సంస్థలు హిందీ వ్యాప్తికి కృషిచేస్తున్నవి. అట్టి స్థితిలో హిందీవాదులు ఇంత హంగామా ఎందుకు చేస్తున్నారో బోధపడడంలేదు. హిందీ కమిషనులో ఎక్కువ ప్రాతినిధ్యం లభిస్తే తద్వారా వారు తమ నిర్ణయాలను ఇతర భాషలవారిమీద రుద్దగలమని అనుకుంటున్నారా ? అది భ్రమ అని వారు ఎంత తొందరగా గ్రహిస్తే అంత మంచిది. హిందీ వాదుల అతివాద ధోరణి దక్షిణదేశంలో జరుగుతున్న హిందీ ప్రచార వ్యాప్తికి ఆటంకాన్ని కలుగజేస్తున్నది.

సనాతనులకు జడియక స్త్రీ విద్యా, స్త్రీ పునర్వివాహ సంస్కరణలు అమలులోనికి తెచ్చిన మహాసంస్కర్తలు, గద్యచక్రవర్తియై తెలుగు సారస్వత రథమును సర్వతోముఖముగ నడపి తెలుగు వారికి వెలుగుబాట చూపిన నవయుగ ప్రవర్తకులు —

శ్రీ కందుకూరి వీరేశలింగం పంతులుగారికి

శ్రద్ధాంజలులు.

కవిత:

# వార్ధకము

శ్రీ మదాచార్య్య రఘునాథ చక్రవర్తి

రాజామాత్య భిషగ్యతీంద్ర సహజాలంకారమున్, మల్ల రూ
పాజీవాజన దాస గాయన విడంబ స్థానమున్, యౌవన
వ్యాజాంధ్యాపనుదంజనంబు, వివిధాహంభావ నిర్వాపణం,
బాజన్మ స్ఖలితాపరోపణచణంబై వార్ధకం బొప్పెడున్.

మలిన స్వభావమేగల
యలకలు శుక్లత్వమెనయు టసహజమని పే
రలుకనొ తెల్లని రదనా
వళి వెడలును నోటి నుండి వార్ధక దశలోన్.

వదలక యాక్రమించుకొన వచ్చు జరానల కీలలన్ రసా
స్పదమగు సార యౌవన సువస్తువు దగ్ధము కావుటన్ వపు
స్పదన పరంపరన్ పలిత సంజ్ఞ వహించి తదీయమైన బూ
డిదయె కనంబడున్; మరి పటిష్ఠత యెట్టుల నిల్చు నమ్మెయిన్!

ప్రాయము లాలసాలత, కషాయము ధారణకున్, సమాపనా
ధ్యాయము వీర్య శక్తికి, నుపాయము శాంతికి, నాపత త్పవి
ప్రాయము యౌవనాద్రికి, కులాయము విస్మృతి, కంతకోద్ధితా
నాయము ప్రాణపక్షి, కుపనాయము భ్రాంతికి వార్ధకం బిలన్.

ఇంతటి వీలున్నను నా
వంతయు సుకృతంబు చేయవని పండ్లూడన్
అంతకుడు కొట్టెనన్నటు
దంతావళి నోటినుండి తరలున్ హుటాహుటిన్.

పలిత శ్మశ్రు శిరోజరాజి కిరణప్రాయంబుగా వృద్ధు వి
ష్కృ-లమౌవ క్తౄము చంద్రమండలము రేఖన్ దోచుటన్ యౌవనో
జ్జ్వల యోషిన్నయనంబులన్ జలజముల్ శత్రుత్వసంసిద్ధిగా
వలయున్ దత్సముఖంబునందు ముకుళీభావంబె ప్రాపించెడిన్.

మరణమును మించి జరయే
పరాభవించెడిని, విడుదు పాపము, ధర్మా
చరణమునకు గడగుండని
శిరము నధిష్ఠించి నెరపు చెప్పన్ జొచ్చెన్.

కృష్ణవ ర్త్మగుణమ్ముల నెన్న జేయ
జీవనమునందు కాంక్షను శిథిలపరుప
వచ్చును హిమానికై వడి వార్ధకంబు
సురతరంగవతీ సేవ కరము మేలు.

వదనం స్తంభము, నాననావనతియున్ ప్రాపించు, కుంచించు మై,
విదలించున్ కరముల్, ప్రియోక్తుల వినన్ వీలీదు, కేళీరతిన్
హృదయోద్వేగము గూర్చు, మేన్మలచు నోలిన్ తన్నవోఢా జరల్
బెదరున్ పూరుషు జూచి యొండపరమున్ భీతిల్ల జేయున్ నరున్.

పడగొట్టిన వారికి రవి
పడువున, శిశిరా ర్తులైన వారికి శశికై
వడి, పడతుల మదికి రుచిం
పదు పెనిమిటి ముదిమిచేత వడిమళ్ళినచో.

ముదుకని తలపై కనపడు
నది నెరపేమియును కాదయా; మరియింకె
ట్టిది యన నాతవిజన్మము
ముధ యని విధిపెట్టిపైన బూడిద చల్లెన్.

చపలురాలన ఇందిర కపయశంబు
కలదు కాని తదీయము కాదు తప్పు;
కడలిదోషమె యగునది, కన్నకూతు
స్వేచ్ఛను పురాణపురుషుని కిచ్చుకతన.

కరధృతదండున్ యముగతి,
హరివలె నగదున్, శశాంకునట్టుల వక్రున్,
హరుపగిది విరూపాక్షున్
జర పుణ్యవిహీనునైన సలుపన్ జాలున్.

ముసలితనము వచ్చి బోసినోటివి తొక్కు
పల్కులను విలుప్తబలము నన్ను
యింద్రియస్థ శక్తి నేర్పడగాజేసి
పసితనంబు మరల వరలజేయు.

స్త్రీలకు మీసకట్టు చనుదేరని బాలుడు శర్కరాధ్యమౌ
పాలవలెన్ రుచించు; నదివచ్చిన యయ్యువకుండు క్షీర స
మ్మేళన నొప్పు చల్లకుపమింపగ నౌ; నిక తెల్లనైన మీ
సాలుగలాడు గుగ్గులు కషాయ మటుల్ వెగటౌ తలంపగన్.

వలువది వింత ధారణయణంగును, చర్మము నేబదేండ్లకున్
బలమరు, దృష్టి షష్టిపయి పాడగు, శుక్రము డెబ్బదింటితో
విలయము చెందు, నెన్పదికి విక్రమముండదు, బుద్ధి తొంబదే
డులు చనినన్ నశించును, చెడున్ కరణంబుల శక్తి నూటితోన్.

నాయకగుణముల కలరిన
నాయికయున్ "పలిత ఇత్యనాదర" అని వా
త్స్యాయను డన్నటు లధ్యవ
సాయవ్యావృత్తయౌను స్థవిర విటు వెడన్.

తలపై గాంధీటోపీ
గలవారికి వచ్చునట్టి ఘనతను టోపీ
వెలియైనను తలనెరసిన పది
కలయప్లే భ్రాంతి గొల్పి గౌరవపదమౌ.

దైవప్రాప్తము ప్రాణివంచనము వృద్ధత్వంబు; తద్భూర్యవస్థా వైవిధ్యము దేహధారి కపహాస్యత్వంబు కల్పించు, కామావిష్కారమును తత్ప్రయత్నము లజ్జాపాదియై స్త్రీకి శోకావేగంబును గూర్చునా నగుట మేలా యేడ్చుటే మంచిదా!

రసభావ తదాభాస
ప్రసర కవిత్వ ప్రణేతృ పరిణత మతికిన్
ముసలితనము వచ్చిననున్
పసతొలగదు రచనలో తపశ్శక్తి మెయిన్.

అనుభూత్యశక్తుడై ర
తిను దృఙ్మాత్రంబుచేత పలుపుకొనెడు వృ
ద్ధుని భార్యయు సంపదవలె
ననయము తద్భృత్యు ననుభవార్థంబె యగున్.

కరధృత దీపం బెటువలె
పరోపకారమునకగునొ ప్రవయోవధు వ
ప్పతుసున పరహితయగుటను
కరదీపన్యాయ మెనయుగా వృద్ధసతిన్.



# హిందీ సాహిత్యము - పూర్వమధ్యయుగము

డాక్టర్ ఆర్యేంద్రశర్మ, యం. ఏ

1350 నుండి 1650 వరకు అనగా మూడువందల సంవత్సరాలు హిందీ సాహిత్యంలో పూర్వమధ్యయుగ మనిపించుకొంటున్నవి ఈ యుగంలో నిర్మాణమైన సాహిత్యాన్ని బట్టి ఈ యుగానికి భక్తియుగమని గూడా పేరు ఏర్పడింది ఈ యుగాన్ని హిందీ సాహిత్యంలో సువర్ణయుగమని అంటుంటారు. ఆ అనడంలో ఏమాత్రమూ అతిశయోక్తి లేదు. కారణ మేమంటే హిందీలో మహాకవులుగా ప్రశస్తిగాంచిన అనేకమంది ఈ యుగంలోనే జన్మించి కావ్యరచన చేశారు. జాయసీ, కబీరు, మీరా, తులసీదాసు, సూరదాసు, రసఖాన్ మొదలగు వారందరూ ఈ యుగంలోని వారే భక్తియుగానికి పూర్వయుగం ప్రారంభికయుగం. ఆ యుగంలో హిందీ సాహిత్యం ఎక్కువగా వికాసాన్ని పొందలేదు. భక్తియుగం తరువాత హిందీలో రీతియుగం వచ్చింది రీతియుగంలో దర్బారీ కవిత్వానికి ప్రాధాన్యత హెచ్చి కవిత్వం నిర్జీవమై సహజప్రవాహగతిని వదలి బంధించిన తటాకంలోని నీటివలె తయారయింది. భక్తియుగంలోనే హిందీ కవిత సర్వాంగీణమైన వికాసాన్ని పొంది విశ్వసాహిత్యరంగంలో ఆదరాన్ని సంపాదించి అభివృద్ధిని పొందింది ఈ యుగానికి సంబంధించిన సూర, తులసీ, కబీర్, మీరాలు నలుగురూ నిస్సందేహంగా విశ్వకవుల శ్రేణిలో స్థానం గలిగినవారే.

ఈ యుగంలో బయలుదేరిన సాహిత్య ప్రవృత్తులను అర్థంచేసుకొనవలెనంటే ఆనాటి సాంఘిక రాజకీయ పరిస్థితులను గూడా అర్థం చేసుకొనడం అవసరం. ప్రారంభిక యుగాన్ని వీరగాథా కాలమని గూడా అంటారు. అది మనదేశంమీద విదేశీయులు ఆక్రమణ చేసిన కాలం. ఆయుగం పూర్తి అయిన నాటికి మన దేశంలో మహమ్మదీయులు శాసకులుగా స్థిరపడి పోయినారు దేశంలో శౌర్య పరాక్రమాదులకు బదులు నిరాశ, నిస్పృహ మొదలగు నవి వ్యాపించి పోయినవి తమ మతంమీదా, తమమీదా అత్యాచారాలు జరిగి దేవాలయాలూ, విగ్రహాలూ నష్టభ్రష్టమై పోవడంతో చేసేది ఏమీలేక భక్తి భావ ప్రపూరితులై జనులు భక్తి భావనా ప్రచారానికి పూనుకున్నారు. అందువలన అనేకమంది భక్తకవులు ఆయుగంలో విలసిల్లినారు. భక్తిభావన మన దేశానికి కొత్తదికాదు భక్తిభావన పురాణకాలంనుండి మన దేశంలో వ్యాప్తమై ఉన్నా కొన్ని రాజకీయ అవాంతరాల కారణం వల్లనూ వజ్రయాన కాపాలిక తాంత్రికాది సంప్రదాయాల వ్యాప్తివల్లనూ మధ్యకాలంలో కొంత మరుగుపడి పోయింది. విదేశీయుల శాసన ఫలితంగా తిరిగి ఆ భావనకు వ్యాప్తి కలిగింది ఇదే కాలంలో రామానుజాచార్యుని సగుణోపాసన దక్షిణ దేశంనుండీ, మధ్వాచార్యుని ద్వైత సంప్రదాయం కర్ణాటకను

నుండీ, జయదేవ విద్యాపతుల భక్తి సంప్రదాయం తూర్పుదేశంనుండీ హిందీక్షేత్రంలోనికి వ్యాపించినవి. దాని పరిణామ రూపంలో ఉత్తర దేశంలో భక్తిప్రవాహం వెల్లువలు గట్టింది. ఆ ప్రవాహంలో హిందువులేగాక కొంతమంది మహమ్మదీయులు గూడా స్నానంచేసి పునీతులైనారు. పోనుపోను ఈ భక్తిశాఖ రామభక్తిశాఖ, కృష్ణభక్తిశాఖ అనే పేర్లతో రెండుగా చీలింది. రామభక్తి ప్రవర్తకుడు రామానందస్వామి అయితే కృష్ణభక్తిప్రవర్తకుడు వల్లభాచార్యులైనాడు. మీరా, తులసీ, సూరదాసు, రసఖాన్ వంటి కవులందరూ ఈ రెండు శాఖల ద్వారా మనకు ప్రసాదించబడిన మహాకవులు.

సామాన్యులకు అందుబాటులో ఉండే సగుణోపాసన సంగతిది. నిర్గుణోపాసన విధానం గూడా ఇంకొకటున్నది. నాథపంథ్‌లో నిర్గుణోపాసన మనకు ఎక్కువగా కనబడుతున్నది. నాథపంథీయులు వేదశాస్త్ర చోదితాలైన కర్మకాండాదులను వదలి "నీ హృదయంలోనే ఈశ్వరుని దర్శించుకొమ్మనీ, జాతిమత భేదాలను వదలి ఆంతరంగిక సాధనపై ఎక్కువగా ఆధారపడమనీ" బోధించారు. తరువాత తరువాత ఈ నాథపంథ్‌లో హఠయోగాదులు గూడా ప్రవేశించినవి. అంతరంగిక సాధనకు ప్రాముఖ్యతనిచ్చి, జాతిమత భేదాలను విస్మరించడం వలన అనేకమంది మహమ్మదీయులు సైతము ఈ పంథాలోనికి ప్రవేశించారు. ఏవిధంగానైతేనేమి ముస్లిములు మన దేశంలో స్థిరపడి పోవడం వలన హిందువులకూ ముస్లిములకూ ఇద్దరికీ ప్రవేశముండే సామాన్యమైన భక్తిమార్గాన్ని అన్వేషించడం సహజమేగదా! ఈ సామాన్యమైన భక్తిమార్గాన్ని నాథపంథ్ అమలులోనికి తెచ్చింది. ప్రసిద్ధ మహారాష్ట్ర భక్తకవి నామదేవుని రచనల్లో మనకు ఇటువంటి భక్తిమార్గం నిరూపితమై కనబడుతున్నది. హిందీలో నిర్గుణోపాసనను బాగా వ్యాప్తిలోనికి తీసుకొనివచ్చే ప్రయత్నం కబీరుదాసు చేసి ఉన్నాడు. కబీరు రామానందుని శిష్యుడు కదా. పైన అద్వైతవాద ప్రభావం బాగా హత్తుకొన్నది. ఇంతేగాక కబీరు తన మార్గంలో నాథపంథీయుల హఠయోగాన్నీ, సూఫీ తత్త్వవేత్తల ప్రేమతత్త్వాన్నీ అన్నింటినీ సమ్మేళనం చేసివేశాడు. మతాలన్నింటిలో ఉన్న ఆడంబరత్వాన్నీ, జాతిమత విభేదాలనూ త్యజించ వలెనని గూడా అతడు ప్రచారంచేశాడు. దాదాపు అన్ని తత్త్వాలూ కబీరు మార్గంలో కలిసిపోయినవని చెప్పవచ్చును.

ఈ యుగంలో వెలువడిన ఇంకొక కవితామార్గం సూఫీ సంప్రదాయానికి సంబంధించినది. సూఫీ సంప్రదాయాన్ని మన దేశంలోనికి ముఖ్యంగా మహమ్మదీయులే తీసుకొని వచ్చారు కాని, హిందీలో బయలుదేరిన సూఫీ కవులమీద భారతీయ భావపరంపర హత్తుకొనిపోయింది. సూఫీ సంప్రదాయం మర్మకవితలో ప్రేమ తత్త్వాన్ని వ్యాప్తిలోనికి తెచ్చింది. సూఫీకవులు కల్పిత ప్రేమకథలను వ్రాసి వాటిలో ఈశ్వర ప్రేమను వ్యక్తం చేశారు. సూఫీ కవులలో జాయసీ ప్రాముఖ్యత గలవాడు. కొంతమంది విమర్శకులు సూఫీమార్గం నిర్గుణోపాసకమని స్థిరీకరించారు.

హిందీ సాహిత్యంలో భక్తి నాలుగు భాగాలుగా విభాజితమై ఉన్నట్లు మనకు కనబడుతున్నది. రామభక్తి, కృష్ణభక్తి, సూఫీ మార్గము, నిర్గుణమార్గము-ఇవి ఆ నాలుగు భాగాలు.

ఇదిగాక ఇంకా కొంత ఇతర సాహిత్య మున్నది. దానిని ఏ శ్రేణిలోనూ చేర్చడానికి వీలులేదు.

కాలానుక్రమాన్ని బట్టి కబీరు నిర్గుణోపాసక కవులలో ముందుగా వస్తాడు. కనుక అతనిని గురించి ముందుగా తెలుసుకొందాము.

నిర్గుణపంథాకు చెందిన కావ్యాలను సంతకావ్యాలని గూడా అంటారు పైన చెప్పబడినట్లు కబీరు వ్యాప్తంచేసిన నిర్గుణ పంథాలో అనేక సంప్రదాయాలు సమ్మిళితం చేయబడ్డవి. వేదాంత, యోగ, సూఫీమార్గ, అహింసావాద, ఏకేశ్వరవాదాది సంప్రదాయాలన్నీ సంత్ సాహిత్యంలో మనకు లభిస్తున్నవి సంత్ సాహిత్యం శాస్త్రీయ పద్ధతులపై నిర్మితమైనది కాదు ఈ సాహిత్యంలో భాషాసౌందర్యముగానీ, అలంకార ఛందశ్శాస్త్రాలకు సంబంధించిన నియమాలుగానీ ఏమీ లభించవు దానికి కారణం సంతకవులు బాగా చదుపుకొన్నవారు కాకపోవడమే. వారు సత్సంగము, దేశపర్యటనానుభవము వలన సంపాదించిన జ్ఞానంతోనే సాహిత్యనిర్మాణం చేశారు అందువలన సంతకవులలో విశేషప్రతిభ గలిగి శాస్త్రీయ దృష్టితో నిలవకపోయినా హృదయాలను స్పృశించే సాహిత్యనిర్మాణం చేసినవారు మాత్రమే శిక్షిత సమాజంలో గౌరవాన్ని పొందగలిగారు.

కబీరు అటువంటి కవి. చదువుకొన్నవాడు గాకపోయినా ఆయన అపూర్వ ప్రతిభా సంపన్నుడు. తన భావాలను అత్యంత ప్రభావోత్పాదకంగా వ్యక్తం చేయగలిగినవాడు ఆయన భాష పరిమార్జితంగా లేకపోయినా హృదయాలమీద సూటిగా పని చేయగలిగినది కబీరు సదాచారాన్నీ, సత్యాన్నీ ఉపాసించినవాడు అతని అంతఃకరణ ఎంతో నిర్మలంగా ఉండేది. హిందూ ముసల్మానులు ఇద్దరిలోనూ ప్రవేశించిన దోషాలను అతడు వెలికిదీసేవాడు ఏ విధమైన భేదభావాలనూ అంగీకరించేవాడు గాడు

కబీరు 1469 నుండి 1518 వరకు జీవించి ఉన్నాడు విగతభర్తృక అయిన ఒక బ్రాహ్మణ స్త్రీ ఒక పిల్లవానిని కని చెరువులో పారవేసినట్లూ, నీరూ అనే పేరుగల ఒక సాలెవాడు ఆ పిల్లవానిని పెంచి పెద్దజేసినట్లూ, ఆ పిల్లవాదే కబీరుదాసు అనీ కబీరు జన్మము గురించి చెపుతూ ఉంటారు

పెద్దవాడైన తరువాత కబీరు రామానందస్వామి దగ్గర రామనామ దీక్షను గ్రహించాడు, దేశపర్యటనా, సత్సంగమూ చేసి జ్ఞానోపార్జన చేశాడు ఆనాడు అమలులోనున్న సంప్రదాయాలు అన్నింటినుండి కొంత నేర్చుకొని సహజభాషలో తన భావాలను వ్యక్తీకరించాడు.

కబీరు కవితలోనుండి కొన్ని ఉదాహరణలను చూదండి,

మాలాతో కరమేఁ ఫిరై, జీభ ఫిరై ముఖమాఁహి
మనువాఁతో దహుఁ దిసి ఫిరై, యహ్‌తో సుమిరిన నాహిఁ

చేతిలో జపమాల, నోటిలో నాలుక తిరుగుతున్నవి. కాని మనస్సు మాత్రం నాలుగుదిక్కులా విహరిస్తున్నది. ఇది నామస్మరణకాదు."

దినభర్ రోజా రహాతహై రాత హనత హై గాయ్
యహ్‌తో ఖూన్ వహ్ బందగీ కైసే ఖుషీ ఖుదాయ్

మహమ్మదీయుడు పగలల్లా రోజా ఉపవాసం చేస్తారు. రాత్రి ఆవును చంపుతారు. భగవం తుడు ఎట్లా ప్రసన్నుడౌతాడు ?

కంకర్ పత్థర్ జోడి కై మస్జిద్ లియా బనాయ్
తా చఢి ముల్లా బాంగ్‌దే క్యా బహిరాహూఆ ఖుదాయ్

కంకర, రాళ్లు పోగుచేసి మసీదు నిర్మించారు దానిపైన నిలబడి ముల్లా అల్లాహో అక్బర్ అని పెద్దగా అరుస్తున్నారు; భగవంతుడు చెవిటివాడా ?

ప్రేమ తత్వాన్ని వర్ణిస్తూ కబీరుదాసు అన్న మాటలు చూడండి

జా ఘట ప్రేమ నసంచరై సో ఘట జాన్ మసాన్
కైసే ఖాల్ లోహారకీ సాంస్ లేత బిను ప్రాన్

ప్రేమలేని శరీరం శ్మశానంలోని శవంతో సమానం కంచరివాని తోలుతిత్తి ప్రాణం లేక పోయినా శ్వాస తీసుకొంటూనే ఉంటుంది

క్షణభంగురమైన జీవితాన్నీ మృత్యువునూ గురించి కబీరు ఏమంటున్నాడో చూడండి.

మాటీ కహై కుమ్హార్‌సే తూ క్యా రూందై మోహిఁ
ఏక్ దిన్ ఐసా హోయిగా మైఁ రూందూంగీ తోహిఁ

కుమ్మరివానితో మట్టి అంటున్నది "ఇప్పుడు నన్ను నీవు కాలితో తొక్కివేస్తున్నావు నేను నిన్ను పూడ్చివేసే రోజులు గూడా రాగలవు."

కబీరు రచనలను ఆయన శిష్యుడు ధర్మదాసు పుస్తక రూపంలో సంగ్రహించాడు. ఆ సంగ్రహానికి బీజకమని పేరు అందులో మూడు భాగాలున్నవి 1 రమైనీ 2. సబద్ 3. సాఖీ. రమైనీ, సబద్ రెండింటిలో పాటలూ, సాఖీలో దోహాలూ ఉన్నవి

సంత కవులలో రైదాసు, ధర్మదాసు, నానక్, దాదూ నలుగురూ విశేష ప్రసిద్ధులు

రైదాసు గూడా రామానందస్వామి శిష్యుడే ఈయన అస్పృశ్యుడు బెనారస్ నివాసి. ఈయన వ్రాసిన గ్రంథమేదీ కనిపించడంలేదు. "ప్రభుజీ తుమ చందన్ హమ్ పానీ" అనే రైదాసు పాట ఉత్తరదేశంలో చాలా ప్రసిద్ధిని పొందింది

ధర్మదాసు కబీరుదాసు శిష్యుడు

గురునానక్ 1469 లో జన్మించాడు. ఇతని నివాసస్థలం పంజాబు. ఈయన రచనలన్నీ సిక్కుల మతగ్రంథం "గ్రంథసాహబ్"లో చేర్చబడి ఉన్నవి నానక్ సిక్కు సంప్రదాయానికి ఆది ప్రవర్తకుడు.

దాదూ దయాలు మొదట కబీరు అనుయాయి. తరువాత తరువాత దాదూపంథ్ అని ఒక సంప్రదాయాన్ని వ్యాప్తిలోనికి తెచ్చాడు. ఈయన రచనలు ఎక్కువ భాగం దోహాలలో ఉన్నవి కొన్ని పాటలు కూడా లేకపోలేదు.

సుందరదాసు, మలూకదాసు మొదలైన వారందరూ ఈ మార్గానికి చెందినవారే.

నిర్గుణ పంథ్‌లోనిదే సూఫీ మార్గమని పైన చెప్పబడియే ఉన్నది. కబీరు, అతని అనుయాయులూ జ్ఞానాశ్రయులు సూఫీ కవులు ప్రేమాశ్రయులు. లౌకిక ప్రేమను వర్ణించి ఈశ్వరప్రేమను వ్యంజితం చేయడం సూఫీకవిత ప్రధాన లక్షణం. ఈశ్వర ప్రేమను ప్రత్యక్షంగా వ్యక్తీకరించక అప్రత్యక్షంగా ప్రేమతత్వాన్ని ఆశ్రయించి కవితా నిర్మాణం చేయడం వలన సూఫీ కవిత ఎక్కువ మనోరంజకంగా ఉంటున్నది. సూఫీకవిత అవధీ భాషలో దోహా చౌపాయీ ఛందస్సుల్లో రచించబడినది. తులసీదాసు రామాయణంలో గూడా ఇదే పద్ధతి అనుసరించ బడింది.

సూఫీ కవులు చాలామంది మహమ్మదీయులు. కాని వారిలో ఏవిధమైన మతపిచ్చిగానీ కనపడదు. వారు హిందు హృదయాలతో భారతీయ సంప్రదాయాలను స్వీకరించారు.

సూఫీకవులలో కుతుబన్, మంఝన్, జాయసీ, ఉస్మాన్, షేక్‌నబీ పేర్లు చాలా ప్రసిద్ధములు

పదిహేనో శతాబ్దం ఉత్తరార్ధంలో కుతుబన్ జన్మించాడు ఈయన జౌన్‌పూర్ సంస్థానంలో దర్బారు కవిగా ఉండేవాడు ఈయన వ్రాసిన పుస్తకం ఒక్కటే ఒక్కటి మృగావతి ఇంతవరకు లభించింది. ఈ గ్రంథంలో చంద్రనగర్ రాజకుమారునికీ కాంచన నగరం రాజకుమారికీ జరిగిన ప్రేమకథ వర్ణించ బడినది

మంఝన్‌కవి జీవిత చరిత్రను గురించి వివరాలు ఏమీ తెలియడంలేదు ఈయన రచించిన మధుమాలతి కావ్యం లభించింది కాని అది పూర్తిగాలేదు. మృగావతి కంటే మధు మాలతి కావ్యం చాలా గంభీరంగా ఉన్నది ఆధ్యాత్మిక ప్రేమ భావప్రదర్శనతుగాను ప్రకృతి దృశ్యాలను అతి సుందరంగా కవి ఈ కావ్యంలో వర్ణించాడు.

మలిక్ ముహమ్మద్ జాయసీ ప్రేమ మార్గాశ్రయ శాఖకు చెందిన సూఫీ కవులందరిలో ఉత్తమోత్తముడు. ఈయన రచించినవి పద్మావత్, అఖరావట్, ఆఖిరీకలామ్ అనే మూడు గ్రంథాలు లభించినవి పద్మావత్ సర్వశ్రేష్ఠమైన కావ్యం పద్మావత్ కావ్యంలో నాయికా నాయకులు చరిత్ర ప్రసిద్ధులైనా కవి తన కల్పన ద్వారా కథను చాలా మనోహరంగా చిత్రించాడు ఈ కావ్యంలో పూర్వార్ధం కవికల్పన మీదా, ఉత్తరార్ధం చరిత్రమీదా ఆధారపడి ఉన్నవి

ఉస్మాన్ 17 వ శతాబ్దంలో చిత్రావళి అనే ప్రేమ కావ్యాన్ని రచించాడు. ఉస్మాన్ చాలా విషయాలలో జాయసీని అనుసరించాడు.

షేక్‌నబీ 17 వ శతాబ్దం ఉత్తరార్ధంలో జన్మించాడు. ఈయన రచించిన కావ్యం "జ్ఞానదీపం."

* * *

రామభక్తి శాఖ ప్రవర్తకుడు రామానందస్వామి. రామానందస్వామి రాఘవానందుని శిష్యుడు. రాఘవానందస్వామి విశిష్టాద్వైత మత ప్రవర్తకుడు విశిష్టాద్వైత సంప్రదాయం

అసలు దక్షిణ దేశంలో ప్రారంభమైనది. మనుష్యరూపధారి అయిన రాముని రామానంద స్వామి ఇష్టదేవతగా స్వీకరించాడు. రామానందస్వామి వైష్ణవమతాంబుజ భాస్కరం, రామార్చన పద్ధతి అనే రెండు సంస్కృత గ్రంథాలను రచించాడు.

రామానందస్వామి శిష్యులు దేశమందంతటా రామభక్తిని విశేషంగా ప్రచారం చేశారు. తులసీదాసు ఆ కోవలోని వాడే. ఆ కోవలోనేగాక హిందీలోని కవులందరిలో తులసీదాసు మహాకవి. అంత సర్వతోముఖమైన ప్రతిభ హిందీభాషలో ఇంకొక కవిలో మనకు కనిపించదు. తులసీదాసురామాయణం గ్రామీణ సమాజంలో ఇంటింటా వ్యాపించింది హిందూ సమాజం ఉత్తరదేశంలో తులసీ రామాయణాన్ని ఉద్గ్రంథంగా భావించి పారాయణ చేస్తుంటుంది తులసీదాసు దాదాపు 1680 లో పరమపదించాడు ఆయన రచించిన గ్రంథాలలో రామచరిత మానస్, వినయ పత్రిక, గీతావళి, కవితావళి, దోహావళి, బరవై రామాయణం విశేష ప్రసిద్ధమైనవి

తులసీదాసు అవధీ, వ్రజభాషలు రెండింటిలో రచనలుసాగించాడు రామచరిత మానస్, బరవై రామాయణ్ అవధీలోనూ, వినయపత్రిక, గీతావళి, కవితావళి వ్రజభాషలోనూ ఉన్నవి

తన గ్రంథాలలో తులసీదాసు ఆనాటి అమలులోనున్న అన్ని శైలులనూ అనుసరించాడు

రామభక్తి శాఖలో అగ్రదాస స్వామి, నాభాదాసు, ప్రాణచంద్ చౌహాన్, హృదయ రామ్ మొదలైనవారు రచనలు సాగించారు కాని వారందరూ తులసీదాసు ముందర సూర్యుని ముందు దివిటీలై పోయినారు అయినా నాభాదాసు రచించిన భక్తమాల విశేష ప్రసిద్ధిని గాంచినది. భక్తమాలలో రెండు వందలమంది భక్తుల చరిత్రలు వర్ణించబడి ఉన్నవి.

రామభక్తి కవులలో తులసీదాసువలె, కృష్ణభక్తి కవులలో సూరదాసు అగ్రగణ్యుడు. ఈ రెండు శాఖలలో భక్తికి ప్రాధాన్యమున్నా కృష్ణ భక్తిలో శృంగారరసానికి ప్రాధాన్యత ఏర్పడింది. ఈ శృంగార రసప్రాధాన్యతవలన తాను రాను హిందీ సాహిత్యంలో అశ్లీల శృంగార రచనలకు గూడా ప్రచారం ఏర్పడింది గోపీకృష్ణుల ప్రేమలీలలు ఎంత అలౌకిక శృంగార రసపూరితాలైనా వానిలో సామాన్యునికి శృంగారమే దృష్టి గోచర మవడం సహజమై పోయింది. సీతారాముల ప్రేమలో ఈ శృంగార తత్వం మనకు కనపడదు

కృష్ణభక్తి ప్రవర్తకులు వల్లభాచార్యులు ఆయన శిష్యులూ భక్తులూ అనేకమంది శ్రీమద్భాగవతాన్ని ఆధారంగా చేసుకొని కృష్ణుని బాలలీలలనూ, గోపీకృష్ణుల ప్రేమలీలలనూ వర్ణించ నారంభించారు. వల్లభాచార్యుని శిష్యులలో ఎనిమిదిమంది విశేష ఖ్యాతి నార్జించుకొన్నారు. సూరదాసు, పరమానందదాసు, కృష్ణదాసు, ఛీతాస్వామి, గోవిందస్వామి, చతుర్భుజదాసు, నందదాసు. ఈ ఎనిమిదిమంది అష్టఛాప్ అని ప్రసిద్ధిని పొందారు. వీరేగాక హిత హరివంశ, మీరాబాయి, రసఖాన్ మొదలగువారు గూడా ఇదే శాఖకు సంబంధించిన కవులు.

శ్రీమద్భాగవతంలో గోపీకృష్ణుల ప్రేమలీలలు ఆధ్యాత్మిక రూపంలో వర్ణించబడ్డవి. కృష్ణుడు ఈశ్వరుడు, గోపిక జీవాత్మ. గోపికలు కృష్ణుని ప్రేమించి కృష్ణునిలో ఐక్యత

పొందవలెనని ప్రయత్నం చేస్తారు. అనగా జీవాత్మ పరమాత్మతో ఏకం కావలెనని ప్రయత్నం చేస్తున్నట్లన్నమాట.

కృష్ణభక్తిపరకములైన కావ్యములు వ్రజభాషలో ఎక్కువగా రచింపబడ్డవి. కృష్ణుని బాల్య లీలలను, ప్రేమలీలలను వర్ణించడానికి మధురమైన వ్రజభాష అనుగుణ్యంగానే ఉన్నది. ఈ కావ్యాలలో సంయోగ విప్రలంభ శృంగారాలు రెండూ వర్ణించబడ్డవి. వాత్సల్య రసవర్ణన గూడా ఈ కావ్యాలలో మనకు అధికంగా లభిస్తున్నది.

కృష్ణభక్తులైన కవులలో సూరదాసు ప్రధాన స్థానాన్ని ఆక్రమిస్తున్నాడు. సూరదాసు దాదాపు ఆరువేల పదాలను రచించాడు. ఆ పదాలు మూడు గ్రంథాలుగా సంగ్రహింపబడ్డవి. 1. సూరసాగర్ 2 సూరసారావళి 3 సాహిత్యలహరి. సూరసాగర్ అన్నింటిలో ప్రసిద్ధ మైనది. దీనిలో కృష్ణుని బాల్యలీలలు, మధురాగమనం, గోపీవిరహంలాంటి సుందరమైన విషయాలు వర్ణింప బడ్డవి సూరదాసుని పదాలు పాడడానికి అనువుగా ఉన్నవి

అష్టఛాప్ కవులలో సూరదాసు తరువాత నందదాసు పేరును తీసుకొన వచ్చును. ఈయన రచించిన రాస పంచాధ్యాయీ, భ్రమరగీత అనే రెండు గ్రంథాలూ ఉత్కృష్ట మైనవి

మీరాబాయి పూర్వ మధ్య యుగంలో జన్మించిన మహాభక్తురాలు. ఈమె రచనలు సంఖ్యలో ఎక్కువగా లేకపోయినా సాధారణ జనుల హృదయ సామ్రాజ్యాలమీద రాజ్యం చేస్తున్నవి. ఆమె రచించిన విరహగీతాలు విశ్వసాహిత్యంలో అమూల్యమైనవి. తరువాత బయలుదేరిన కృష్ణభక్త కవులలో రసఖాన్ ప్రసిద్ధుడు రసఖాన్ ఢిల్లీలో నివసించే పఠాను. కాని అనన్య కృష్ణభక్తుడు. ప్రేమవాటిక అనే కావ్యాన్ని రచించాడు. భారతేందు హరిశ్చంద్ర ఒకచోట వ్రాస్తూ-

"ఇన్ ముసల్మాన్ హరిజన్పై కోటిన హిందూ వారియే" అన్నాడు. 16 వ శతాబ్దం ఉత్తరార్ధంలో రసఖాన్ రచనను సాగించాడు

ఆయా యుగాలలోని సాహిత్యం ఆనాటి సాంఘిక రాజకీయ పరిస్థితులను బట్టి ప్రభావిత మవుతుందని మొదటనే మనవిచేసి ఉన్నాము. అందువల్లనే సాహిత్యం జీవిత ప్రతిబింబమనీ సమాజానికి దర్పణమనీ మన పెద్దలన్నారు.

హిందీ సాహిత్యంలోని పూర్వ మధ్యయుగంనాటి రాజకీయ పరిస్థితి మన దేశ గౌర వాన్ని వ్యక్తీకరించేది కాకపోయినా ఆనాడు మన సమాజం భక్తిజ్ఞాన రంగాలలో అద్భుతమైన వికాసాన్ని సాధించింది.

నిజంగా పూర్వమధ్యయుగం హిందీసాహిత్యంలో సువర్ణయుగమే.



వ్యాసము :

# మార్కండేయ పురాణములు - మనుచరిత్రము

శ్రీ పల్లా దుర్గయ్య, యం. ఏ.

ఆంధ్ర ప్రబంధములకు మనుచరిత్రము తలమానికము. ఆద్యప్రబంధ ఖ్యాతి నిది చూఱగొన్నది. దీని కర్త అల్లసాని పెద్దన కవీంద్రుడు. 'స్వారోచిష మనుసంభవమును మార్కండేయ పురాణోక్త ప్రకారంబున జెప్పు' మని యడిగిన రాయల కోరిక ననుసరించి యీ ప్రబంధ నిబంధనమునకు గడంగినట్లు గ్రంథకర్తయే కృత్యాదిలో దెలిపియున్నాడు. మార్కండేయ పురాణము పెద్దనకు నించుమించు 300 సం॥లకు పూర్వమే తిక్కన శిష్యుడగు మారన కవిచే నాంధ్రీకరింప బడినది. స్వారోచిష మనువు కథ సంస్కృతాంధ్ర పురాణములందొకే విధంగా గన్పించు చున్నది. మారన సంస్కృత పురాణ కథను చాలవఱకు వర్ణ భావములతో గూడ నున్న దున్నట్లుగా దెనిఁగించెను. ఒకటి రెండు సందర్భములందు మాత్రము మూలము నతిక్రమించి సమయోచితములగు వర్ణనలు రమ్యముగా నొనరించెను. కథయందేమాత్రమును మార్పు కానరాదు. సంస్కృతాంధ్ర పురాణములందు దేనిననుసరించి మనుచరిత్రమును రచించినదియు పెద్దన చెప్పుకొనలేదు. ఈ గ్రంథమును విమర్శించిన పండితు లనేకులు తెలుగు మార్కండేయ పురాణమును పెద్దన యనుసరించెనని భావించి యున్నట్లు వారి వ్రాతల వలన దెలియవచ్చు చున్నది. ఇది చాల వఱకు సత్యమే యైనను మనుచరిత్రమును సూక్ష్మముగా పరిశీలించితిమేని పెద్దన సంస్కృతాంధ్ర పురాణముల రెంటిని గూడ బాగుగ జదివి మనుచరిత్రమును రచించినట్లు స్పష్టపడగలదు. ఒక ఉదాహరణమును మాత్రమిట జూపుదును

ప్రవరుని గుణరూపాదులను జెప్పు సందర్భమున

మృదుస్వభావః సద్వృత్తో వేదవేదాంగ పారగః
సదాఽతిథిప్రియో "రాత్రా వాగతానాం సదాశ్రయః"

ప్రవరుడు రాత్రులందు వచ్చిన అతిథులకును ఆశ్రయమిచ్చువాడని సంస్కృత పురాణమున జెప్పబడి యుండగా మారన యీ వివరమును విడిచి 'అతిథి జనార్చనాభిరతు'డని యొక్క మాటలో జెప్పి యూరకుండెను. ఇది మనుచరిత్రమునందు పెద్దన, రాత్రియందును అతిథి సంతర్పణలు చేయునని చెప్పుటవలన ప్రవరుని 'అతిథి జనాభిరతి' మఱింత ప్రకాశించునను నుద్దేశముతో నీ సందర్భమున సంస్కృత పురాణమునే యనుసరించుచు, ప్రవరుని గృహిణిని గూర్చి చెప్పునప్పుడు

పంట నలయదు వేవురు వచ్చిరేని
అతిథు లేవేళ "నడికిరేయైన బెట్టు"

నని వ్రాసెను. దీనిచే పెద్దన సంస్కృతాంధ్రోభయ పురాణములను బఠించి పరిశీలించి మనుచరిత్రమును వ్రాసెననుట నిరూపిత మైనది.

పెద్దన చాలవఱకిట్లుభయపురాణముల ననుసరించు వాడయ్యును గొన్ని చోట్లయందీ రెండు మూలములను గూడ నతిక్రమించి స్వతంత్రించి చిఱుమార్పులను చేర్పులను గావించుచు వచ్చెను. ఇట్టి మార్పులలో గొన్ని స్థూలదృష్టికిని మఱికొన్ని సూక్ష్మదృష్టికిని గోచరించునవిగా నున్నవి. పైకి గనబడు మార్పులను పలువురు పండితులింతవరకే పలుమారులు చర్చించి యందు గొన్నిటి నంగీకరించిరి కొన్నిటిని ఆక్షేపించిరి ఇట్టియాక్షేపణములు మనుచరిత్ర రచనమును గూర్చి యనేకము కలవు వీనిలో 'హుతపకాలము' వంటి వొండు రెండు తక్క తక్కినవి యాక్షేపమాత్రములు, ఇట్టి వానిలో గొన్నిటిని గొందఱు విమర్శకులు సప్రమాణముగా ఖండించి సమర్థించిరి 'హుతపకాలము' వంటి విప్పటికిని సమర్థితముగా కాలేదు. కాబోవేమో ; మనుచరిత్రమునందు రెండు పురాణముల నతిక్రమించి యౌచిత్య పోషణమునకై పెద్దన కావించిన మఱికొన్ని మార్పులు చూచుటకు చిన్నవేయైనను గుణమునందు మిన్నలైనవి యింతవఱకీ విషయమున కృషిచేసిన వారిలో నెవరి కంటను బడలేదు. ఇవి చిన్నవగుటచే ప్రత్యేకముగా పెద్దన యొక్క ఔచితీ పోషణ పాటవమును జాటజాలి యున్నవి ఇట్టి చిఱుమార్పులును పీ ప్రబంధమును నవ్యక్తమధురముగా నొనరించి రసోత్పత్తికి తోడ్పడినవి ఇట్టి వానిలో నా దృష్టికి దగిలిన వానిని జూపించి, చర్చించి వాని గుణాగుణములను నాకు దోచిన విధమున సకారణముగా నిరూపించుటయే ఈ వ్యాసముయొక్క ముఖ్యోద్దేశము, ఇంతివఱకును మనుచరిత్రమును గూర్చి వ్రాసిన పండితులు పలువురు కావున నట్టివారిలో గొందరి నామములను స్మరించుట నాకు తప్పదు అంత మాత్రమున వారియెడ నాకు గౌరవము లేదనికాని దురభిప్రాయము కలదని గాని యెవ్వరును తలంపకుందురు గాక ; కేవల సత్యనిరూపణమే నా యుద్దేశమని గ్రహించి మన్నింతురని ప్రస్తుతమున కుపక్రమింతును.

మనుచరిత్రములోని పద్యసంఖ్య ·

1 వావిళ్లవారు ప్రకటించిన మనుచరిత్ర 'పీఠిక' xiv వ పుటలో శ్రీ ప్రభాకరశాస్త్రి గారిట్లు వ్రాసినారు 'మారన కవిత్వమున ౧౩౦ పద్యములలో ముగిసిన కథ యాతని (పెద్దన) కవనమున ౬౦౦ పద్యముల వరకు బెరిగినది'.

2. ఆర్. వేంకటేశ్వర్ అండ్ కంపెనీ (మదరాసు) వారిచే ప్రకటితమైన స్వారోచిష మనుచరిత్రము పీఠికలోని 'కథాది విమర్శనము' అనుశీర్షిక క్రింద 33 వ పుటలో నిట్లు వ్రాయబడియున్నది.

"అందు (తెనుఁగు మార్కండేయ పురాణము) ౧౩౦ పద్యములలో నిమిడిన కథ నిందించుమించుగా ౬౦౦ పద్యముల నిబంధించినాఁడు."

(తంజనగరం తేవప్పెరుమాళ్లయ్యగారు)

3. 1955 సంవత్సరపు కిన్నెర సంక్రాంతి సంచికలో 'మనుచరిత్రము, మార్కండేయ పురాణము' అను వ్యాసమునందు శ్రీ బులుసు వేంకటరమణయ్యగారిట్లు వ్రాసినారు.

"పెద్దనయుం దనయేలిక కోరిక ననుసరించి యందలి కథా సంవిధానమును మార్చక, వలయునెడ కొలంది మార్పులను మాత్రము రసానుగుణముగ నొనర్చి యించుమించు మూటయేబది (౧౫౦) పద్యములలో నున్న మూలకథ "నెనిమిదివందల" పద్యముల పెద్ద ప్రబంధముగా రచించెను"

పై వ్రాతలలో ముగ్గురును తెనుగు మార్కండేయ పురాణములోని పద్యసంఖ్యను గూర్చి వ్రాయునపుడు ౧౫౦ అనియు, ఇంచుమించు ౧౫౦ అనియు అందలి పద్య సంఖ్యను ఇంచుమించుగా సరిగా తెలిపిరి కాని యీ ముగ్గురును మనుచరిత్రమునందలి పద్యసంఖ్యను తెలుపునప్పుడు ౮౦౦ అనియు ఇంచుమించుగా ౮౦౦ వందలనియు నొక్కరీతిగనే వ్రాసిరి. ఇది యొకరిని జూచి మఱియొకరు వ్రాసినట్లున్నదిగాని గ్రంథమును జూచి వ్రాసినట్లులేదు ఇందెవరో ముందు ప్రమాదమున ౮౦౦ పద్యములు గలవనిరి దానిని జూచి తర్వాతి వారును నట్లేవ్రాసి మొదటివారి త్రోవనే పోయిరి ఇంచుమించు ౮౦౦ అనుటకంటె ఇంచుమించుగా ౭౦౦ పద్యములు గలవనినచో సత్యమునకు సమీపమున నుండెడిది ఒకవేళ మొదటి వారట్లే వ్రాసియుండ ముద్రణమున ప్రమాదము జరిగియుండ వచ్చును

*స్వారోచిష మనుసంభవకథ సంస్కృత పురాణములో 56 మొదలు 62 వఱకు గల 7 అధ్యాయములలో 266 శ్లోకములలో జెప్పబడి యున్నది. దీనిని మారన యించుమించు 150 పద్యములలో తెనిగించెను ఈ పురాణకథను పెంచి పెద్దన ప్రబంధముగా రచించెను. ఈ మనుచరిత్రము నందలి పద్య గద్య సంఖ్య మొత్తము వావిళ్ళవారి ప్రచురణమునందు 669 వేంకటేశ్వర అండ్ కంపెనీవారి ప్రచురణము నందును, నాయొద్దగల కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సువారు ప్రకటించిన మూల ప్రతియందును పద్యగద్య సంఖ్య 668 కలదు ఇందు 'ఆ సమయంబున' వంటి చిన్న గద్యములును చేరి యున్నవి, వీటికి షష్ఠ్యంతములు కలిసి 47 మఱియు ఆశ్వాసాద్యంత పద్యగద్య సంఖ్య 29 అనగా కథతో సంబంధించని 76 పద్యగద్యములును పై మొత్తమునందు చేరియున్నవి. ఈ 76 పోగా మొత్తము కథాభాగము 593, పద్య గద్యములలో అనగా ఇంచుమించుగా 600 పద్య సంఖ్యలో గలదు. కావున 'మనుచరిత్రము' ఇంచుమించు 600 పద్యములలో వ్రాయబడినదనియు, లేదా మనుచరిత్ర ప్రబంధమునం దించుమించు 700 వందల పద్యములు కలవనుటయు సమంజసము.

ఇందలి పద్యసంఖ్య ౮౦౦ అనుట ప్రమాదము.

ప్రవరనామము

సంస్కృత పురాణమునందు విప్రునకు పేరులేదు. ద్విజాతి ప్రవరుడని మాత్రము కలదు. చూడుడు

స్వారోచిషాఖ్య మన్వత్తు శృణు తస్మా దనన్తరమ్
"కశ్చిత్ ద్విజాతి ప్రవరః పురే భూ దరుణాస్పదే
వరుణాయాస్త టే విప్రో రూపేణాత్యశ్వినావపి.

ఇందలి ప్రవర శబ్దము శ్రేష్ఠవాచకము.

దీనిని మారన

'వరుణానదీ తటమున, వరుణాస్పదమను పురంబునం దతులగుణో
త్తరుడు గల 'దొక్క ధరణీ సురవరు' డశ్వినులకంటె సుందరు డెందున్.'
'అతి సుకుమారమూర్తి 'ప్రవరాఖ్య'డు దాత్తుడు '

అను పద్యమున నతడు ప్రవరుడను పేరు గలవాడని వ్రాసెను ఇట్లు మారన కల్పించిన నామమునే గైకొని పెద్దన తన మనుచరిత్రమునందు "ఆ పురిబాయకుండు మకరాంక శశాంక మనోజ్ఞమూర్తి 'ప్రవరాఖ్య' దలేఖ్యతనూవిలాసుడై" అని చెప్పి ప్రవర నామమును ప్రచారమునకు దెచ్చెను. ఇది యిట్లుండగా శ్రీ చేకుమళ్ల అచ్యుతరావుగారు తమ 'ఆంధ్ర వాఙ్మయ చరిత్ర' రెండవ భాగము పుట 126 అడుగున-

"మూల కథయందు బ్రాహ్మణ ప్రవరుడనియే యున్నది అనగా బ్రాహ్మణ శ్రేష్ఠుడని యర్థము అతని పేరెద్దియో గాన్పింపదు కావున మనుచరిత్రలోనున్న ప్రవరనామము అల్లసాని పెద్దన్న యిచ్చినదే" యని వ్రాసిరి కాని యిది సరికాదు ఈ పేరు మొదట పెట్టినవాడు మారనయే యని మనము పైన గమనించితిమి

ప్రవరుని అభిలాషము :

" తస్య జజ్ఞే మతః పృథ్వీ మటేయ మితి నిత్యదా
కాననోపవనోద్యానాం నానానగరశోభితామ్ "

కాననోపవన నగరాదులచే శోభితమయిన పృథివి (ప్రపంచము) యందు సంచరించు కోరిక ప్రవరునకు కలిగినట్లు సంస్కృత పురాణమున గలదు. మారనయు పై విధముననే ' శైలకాననాంచిత సకలావనీతల విశేషము లెల్లను బ్రీతి గన్గొనగా మతికడుగోరు చుండు ' అని వ్రాసెను.

పెద్దన ప్రవరుని గుణశీలములను బై రెండు పురాణములలోకంటె మదాత్తముగా జిత్రింపనెంచినవాడు కావున పూర్వోక్త గుణగణములకు పోషకముగా నుండునట్లు పై భూకాన నాది వినోద సందర్శనాభిలాషమును సవరించి 'అనుదినము తీర్థ సందర్శనాభిలాష' మాత్మ మహాంగ వర్తరుణాగ్నిహోత్రి' యని మార్చి చెప్పెను తర్వాత సిద్ధునితోడి సంభాషణావసరమునను దీనికి బ్రోద్బలముగా 'పోయి సేవింపలేకున్న పుణ్యతీర్థమహిమ విననయు నిఖిల కల్మషహరంబు' అని ప్రవరునిచే బలికించి యతని యీ కోరిక కేవలము ప్రీతికొఱకు గాక పుణ్యము కొఱకని స్పష్టముచేసెను.

ప్రవరుని కుటుంబాదిక విషయములు :

సంస్కృతాంధ్ర పురాణములలో బ్రవరుని ప్రాయము కాని, యతని వైవాహిక జీవిత విషయముగాని కుటుంబ వివరములుగాని కొత్తగా దెలుపబడలేదు. అతని వైరాగ్యము సంగతి సూచింపనేని బడలేదు. పెద్దన యిచ్చోట బ్రత్యేక శ్రద్ధవహించి.

"యౌవనమందు యజ్వయు ధనాఢ్యుడునై కమనీయకౌతుక
శ్రీవిధి కాకలుల్ గొలిచి చేసిన కూడిమి సోమిదమ్మ కా

వ్యావహార్యమై తణింప సుఖులై తలిదండ్రులుగూడి దేవియుణా
దేవరహోత్ర నుండి యిలదీర్పగ కాపుర మొప్పు వానికిన్ "

అను పద్యముచేత ప్రవరుడు తరుణాగ్నిహోత్రి యనియు, వివాహితుడనియు, వృద్ధులగు మాతాపితరులు పార్వతీ పరమేశ్వరులవలెనుండి యతని కాపురమును దిద్ది తీర్చుచుండి రనియు దెలిపెను. ఇట్లు చెప్పుటచే నతనికి గృహకృత్యములను గూర్చిన చింత యేమాత్ర మును లేనివాడై తన కాలమంతయును ధర్మకర్మ దీక్షాపరతంత్రతతో గడుపు నవకాశము ప్రవరునకు గలదని ధ్వనింప జేసెను. 'మాన్యక్షేత్రముల్ పెక్కు చందాలం బందు నొక ప్పుడుం దరుగ దింటం బాడియుం బంటయుణా' అను దానిచేతను పై విషయముసేకాక అతిథి జనసత్కార సామర్థ్యము గలవాడను విషయమును దెలిపిన వాడాయెను. 'వాని చక్కదనము వైరాగ్యమున జేసి కాంక్షసేయు జార కామినులకు భోగబాహ్యమయ్యె ' అని ప్రవరుని ఖ్యాతి కంతకును హేతుభూతమగు వైరాగ్య గుణము నుగ్గడించి, భావి యగ్నిపరీక్షలో విశ్చలుడై విలువ ద్రొక్కుకొని బయటపడు సామర్థ్య మతనికి బ్రసాదించెను. ఈ విషయములు మూలమున బొత్తుగా లేవు. మనుచరిత్రమున నిట్టి పట్టు లెన్నియేని చూపవచ్చును.

అతిథి విషయము

సంస్కృత పురాణమునందు ప్రవరు నింటికి వచ్చిన ఆ అతిథిని గూర్చి యిట్లు చెప్ప బడి యున్నది

'అథాగతోఽతిథిః కశ్చిత్ కదాచిత్ తస్య వేశ్మని
నానౌషధీ ప్రభావజ్ఞో మన్త్రవి ద్యంత్రసాధకః'

దీనిని మారన సంగ్రహించి తెలుగు పురాణములో

"ఒకనా డొక యౌషధసిద్ధు డింటికిన్" వచ్చెనని వ్రాసెను పెద్దన మారననే యనుస రించి "చేరె నొక్కనాడు మౌషధ సిద్ధు డొకడు" అని 'ఔషధసిద్ధు'డనియే చెప్పి యతని యాకారము విన్నులకు గట్టునట్లుగా 'ముడిచిన యొంటి కెంజడ మూయు మువ్వన్నె మెగము తోలు కిరీటముగ ధరించి' యను సీస పద్యమును స్వభావ మధురముగా రచించెను

ప్రవరుని ప్రశ్న విధానము

పతతో "విస్మయావిష్టః" ప్రాహ తం ద్విజసత్తమమ్

అట్లు వచ్చిన యతిథి తాను జూచిన దేశనగరాదులను, నదీ వనశైలముల వింతలను జెప్పగా విని ప్రవరుడు 'విస్మయావిష్టు'డై యడిగినట్లు సంస్కృత పురాణమునందుండగా మారన-

అని చెప్పిన నవ్విప్రుండు "భూసురవరుం" దప్పక చూచి "నవ్వుచు" నీక్రింది విధమున బ్రశ్నించినట్లు మార్చి వ్రాసెను.

వాయువు రక్షాదేశం మునివల్లభ ! వృద్ధుడవొంటె గావు లే
ప్రాయపువాడ వద్రి వన రమ్యములైన యనేక దేశముల్

ధీయుతు లల్పకాలమున త్రిమ్మర తక్కమె నీకు నెమ్మెయిన్
జేయుదువేల నమ్మ నెద నీపలుకన్న మునీంద్రు డిట్లనున్.

పై పద్యమునందలి సంస్కృతమున విస్మయావిష్టుడైమాత్ర మడిగినట్లున్న కావిచ్చి కూర్చి మారన 'అలాత్ర వేదపారగుం' డని తాను మున్ను వర్ణించిన ప్రవరునితో మిగుల నసత్యముగా పలికించెననుట దెలియును. కారణము చింత్యము. ఇందలి 'మునివల్లభ! ధీయుత' యను సంబోధనములకును, 'వాయుపురజ్ఞులేల? అల్పకాలమున త్రిమ్మర తక్కమె నీకు నెమ్మెయిన్? నేయుదు వేల నమ్మ నెద నీ పలుకు' అనుటయం దెంతయు విప్రతిపత్తి ద్యోతక మగుచున్నది. పెద్దలయెడ నవిశ్వాసమును, 'వాయుపురజ్ఞులేల ?' యను తిరస్కారమును, పైగా నీమాట లతని మొగము జూచి నవ్వుచు నొవ్వనాడుట ఉదాత్తుడగు వేదపారగు డెట్లగును? పద్యమునందు మునివల్లభయని సంబోధన మున్నను వచనమునందు "కొంకుచు నడుం తప్పక చూచి నవ్వుచు" అని చెప్పబడుటచే అతిథిని ప్రవరుడు తనవంటి కుమారుని గనే తలంచి నవ్వియుండునని స్ఫురింపకపోదు ఇంతమాత్రముచే పై యనౌచిత్యమును బరిహరించుటకు వీలులేదు. కాను వ్రాయునది పురాణమగుట చేతను, అనేక కథలలో నీకథయు నొకటియయి యుండుటచేతను మారన దీనికంత ప్రాధాన్య మొసగలేదనుకొన వలెను.

ఈ కథనే గైకొని ప్రత్యేక ప్రబంధముగా రచింప నెంచిన పెద్దన యీ లోపమును గమనించి సంస్కరింప దలంచియో యన్నట్లు-

'నేనిట్టి మహాద్భుతంబుల నీశ్వరానుగ్రహంబున గనుగొంటి' నని సిద్ధునిచే మొదటనే చెప్పించెను. పిమ్మట 'అనుటయు నీషదంకురిత హసన గ్రపిష్ఠ గండయుగళుం డగుచు' అని యించుక వంకురించిన నవ్వును ప్రవరునిచే ప్రయత్న పూర్వకముగా గ్రమింగించి,

వెలవక మీకొనర్తు నొక విన్నప మిట్టివి యెల్ల జూచిరా
నెలకలు గట్టుకొన్న మతి యేండ్లును పూండ్లును బట్టు, ప్రాయపుం
జెలుత దనంబు మీమొగము చెప్పక చెప్పెడు నద్దిరయ్య! మా
కెలుగతరంబె మీ మహిమ లీర యెఱుంగుదు రేమి చెప్పుదున్!

అనునట్లు వినయముతో వచింపించి ప్రవరునకు పెద్దలయందుగల భక్తి విశ్వాసములను దేట పఱచెను. పెద్దల యెదుట నవ్వుట కూడ అవినయమని తలచి యతనిచే నవ్వును దిగ మ్రింగించెను. కావ్యౌచితిని పోషించు విషయమున పెద్దన మిగుల శ్రద్ధవహించెననుట కిట్టి చిఱుమార్పులచే మనము దెలిసికొన వచ్చును. ఈ విషయము నొకరిద్ద ఱిదివఱకే చర్చించి యుంట దీని నింతతో వదలెదను.

కుతపకాలము :

సిద్ధుడు ప్రవరుని యింటికి ఏ సమయమున వచ్చిన వివరము సంస్కృత పురాణముల యం దెందును లేదు. మను చరిత్రమునందు మాత్రము ఒకచోట "కుతపకాలము"నందు

ఔషధసిద్ధుఁ డొకఁడు ప్రవరుని యిల్లు జేరినట్లు చెప్పఁబడినది. ఈ కుతప కాలమునకును, హిమాలయమున ప్రవరుడు 'నయి నయిగా మధ్యాహ్నముగా దెల్పెడిగా' అనిన మధ్యాహ్న కాలమునకును సమన్వయము చక్కఁగా కుదురుట లేదనియు కావున నిది యసందర్భముగా నున్నదనియు నీ 'కుతపకాలము' అనుదానిపై నాక్షేపణము కలదు. ఇప్పటికి సుమారు ఏబది సంవత్సరముల నుండియు పలువురు దీనిని గూర్చి చర్చించుచునేయున్నారు. కొందఱు దీని నసందర్భమనిరి. కొందఱు సిద్ధుడు వచ్చిన మఱునాడు ప్రవరుడు హిమాలయమున కేగెనని చెప్పి సమర్థింపఁజూచిరి. కొందఱు అరుణాస్పదపురమునకును హిమాలయమునకును నడుమగల దూరమునుబట్టి యీ రెండు ప్రదేశములందును సమయభేద మెంతయునుండునని చెప్పి సమర్థింప యత్నించిరి ఇట్లెందఱెన్ని విధములనో తమ బుద్ధిబలమును యుక్తిశక్తుల నుపయోగించి చూచిరి కాని యీ చిక్కు ఇప్పటికిని విడిపోలేదు. మనుచరిత్రముపై చేయఁబడిన యాక్షేపణములన్నియు నొకెత్తు, నీ కుతపకాల మొక యెత్తు. దీనికి దగిన సమాధాన మెన్నటికేని కుదురగలదో లేదో చెప్పుట దుస్తరము తాళపత్ర ప్రతులను బరిశోధించిన నీ విషయమున గొంత యుపయోగించునేమో పండితు లింకను నాలోచింతురుగాక !

పాదలేప సంప్రశ్నము

"మమ ప్రసాదం భగవన్ కురు మన్త్ర ప్రభావజమ్
ద్రష్టు మేనాం మమ మహీం మహతీచ్ఛా ప్రవర్తతే
స ప్రాదా ద్బ్రాహ్మణ స్తస్మై పాదలేప ముదారధీః

అభిమన్త్రియామాస దిశమాఖ్యాతం తేన యత్నతః

తేనానులిప్తపాదోఽథ స ద్విజో ద్విజసత్తమ
హిమవన్త మగా ద్ద్రష్టుం నానాప్రస్రవణాన్వితమ్ "

అని ప్రవరుడు పాదలేపమడిగినట్లును, సిద్ధుడు దానిని బ్రవరున కిచ్చినట్లును, దాని నతడు స్వయముగా అడుగులకు రాచుకొని హిమవంతమున కేగినట్లును చెప్పఁబడినది. మారనయు దీనిని-

"అనవుడు నాద్విజుండు ప్రియమారగ సిద్ధునిమాట యాదియి
ట్లను "ధరజాదువేడ్క హృదయంబున నాయదు నాకు బాదలే
పన పరమౌషధంబు మునిపాలక ! యిచ్చి కృతార్థుఁజేయవే
యను" నని వేడుకొన్న మునినాయకు డాతని కిచ్చె నిచ్చినన్.
'అదివ్యౌషధముం దన పాదంబులయందు దాల్చి పవనరయమునఁ
భూదేవుఁ డుదఙ్ముఖుడై మోదంబున హిమనగేంద్రమునకుఁ జనియెన్.

అని సంస్కృతమున నున్నట్లే వ్రాసెను. పై రెండు మూలములందును నొకేవిధముగ నున్న పై విషయము గొంతమార్చి పెద్దన మనుచరిత్రమున నీ విధముగ కల్పించెను. చూడుడు:

'అన నవ్విప్రవరుండు కౌతుకభరవ్యగ్రాంతరంగుండు, భ
క్తినిబద్ధాంజలి బంధురుండు నయి, 'మీ దివ్యప్రభావం బెఱుం
గని నా ప్రల్లదముల్ సహించి మునిలోకగ్రామణీ ! సత్కృపన్
నను మీ శిష్యుని దీర్థయాత్రవలనం ధన్యాత్ముగా జేయరే !'

అని ప్రార్థించెనట ! ఇట్లు వేడుటయందలి విశేషమేమి ? సంస్కృత పురాణమున ప్రవరుండు 'హే భగవన్ ! నేనును ఈ ప్రపంచమును జూచి కుతూహలపడుచున్నాను. కావున మంత్ర ప్రభావమును నాకు బ్రసాదింపు' మని వేడుకొనగా 'ఉదారధీశాలి'యగు నతిథి యతనికి "పాదలేప"మభిమంత్రించి యొసంగినట్లు చెప్పబడినది ఇట "భగవన్" అను సంబోధన అతిథికి ముదము కలిగించునట్లు కడు నుచితముగ నున్నది మఱియు నడిగిన మాత్రన నతడు పాదలేపము నిచ్చుటకు గారణ మతిథి 'యుదారధీ' యగుటయని తెలుపబడినది. ఈ సందర్భమున మారన 'మునినాయక ! నాకు ధరంజూచు వేడ్క గలదు, పాదలేపన పరమౌషధంబు నిచ్చి కృతార్థుని జేయు'మని ప్రవరుని వేడ్కొనఁ జేసెను. ఇట్లు వేడుకొనగా దానిని మునినాయకు డాతని కిచ్చెనని చెప్పెను

ఇక పెద్దన పద్ధతి నరయుదము- 'మురారే స్తృతీయః పంథా' అన్నట్లు పైరెండు పురాణములను గాదని ప్రత్యేకమార్గ మవలంబించెను ప్రవరునిచే ముందుగా భక్తితో మ్రొక్కించెను. పిమ్మట 'మీ దివ్యప్రభావం బెఱుంగని నా ప్రల్లదముల్ సహించి' యనుటచే మీరు దివ్యప్రభావ సంపన్నులని పొగడిన వాడాయెను ప్రవరు డెట్టి యధికప్రసంగము చేయని వాడేయైనను సంభాషణా సమయమున నట్టి వేమేని దొరలి యుండినచో క్షమింప వలసిన దని వేడుకొనఁజేసి గత సంభాషణమునం దెచ్చట నుపయోగింపని విధమున "మునిలోక గ్రామణీ !" యను శ్లాఘాపూర్వక దీర్ఘసంబోధనము చేయించి, మీ శిష్యుడనగు నన్ను దయతో తీర్థయాత్రవలన ధన్యాత్మునిగా జేయుడని విజ్ఞప్తి చేయించెను. అయిన పెద్దన నడిన యీ ప్రయాసకు ఫలమేమి ? ఇట్టి మార్పు నెందులకు చేసెను ? ఈ ఉక్తి భంగిమ వలన నతడుగాని ప్రవరుడుగాని సాధించినదేమి ? ఆలోచించి యిందలి సామంజస్యము నరయుదముగాక ! ఇందలి యౌచితిని గుర్తించుటకు ముందు కొన్ని విషయములు తెలిసికొన నవసరము.

1. సిద్ధు డీశ్వరానుగ్రహ సంపన్నుడు.

2. ఈశ్వర ప్రసాదమున లభించినట్టి గగనగమనమును ప్రసాదించు పాదలేపన దివ్యౌషధ రసము సిద్ధునకు ప్రాణప్రియమైనది. దాని యాధారముననే యతని తీర్థసేవ కొనసాగుట. పాదలేప విషయ కథనమే 'ఏనుం రహస్య' మని యతడు ప్రవరున కిది వఱకే తెలిపెను. ఇట్టి దివ్యౌషధ రసమును సిద్ధుడు తన పూజకునయోగించు 'రసలింగము'

దీనివల్లే ప్రేపనల్ల దంతరు బిరణియందు నించి తన కక్షపాలలోనో కావికటుసముసందో అతి రహస్యముగా భద్రపఱచి ప్రాణతుల్యముగా కాపాడుకొను చుండెను. ఈ సంగతి ప్రవరుని యందు దయగలిగిన సిద్ధుడు దానిని బయటపెట్టు వఱకును సమీపస్థుడగు ప్రవరు వకు గాని, దూరస్థులగు మనకుగాని కొత్తగా దెలియదు.

3 పాదలేపన ప్రభావమున త్వరిత గమనంబున జరింతువని చెప్పేవేళాని సిద్ధు డట్టి యౌషధము తనచెంత నెప్పు డింతను గలదనికాని లేదనికాని ప్రవరునకు దెలుపలేదు

4 పాదలేప మిమ్మని ప్రవరుడు మాటిగా నడిగిన యెడల, నది యప్పు డతనికడ లేకున్నచో, తనయం దాదరాయత్త చిత్తుడైయున్న సిద్ధుని మనస్సునకు 'ఇంతటి సద్బ్రా హ్మణునకు సాయముసేయలేక పోయితినిగదా !' యని విచారము గలిగించిన వాడగును 'అయ్యో ! నోరువిడచి యడగినను ఈయఁ బోయెగదా !' యని ప్రవరునకును చింత గలుగక మానదు

5 ఒకవేళ నా పసరున్నను, నతనికి ప్రాణప్రియమై యనుదినోపయోగ్య మగునట్టి దాని నిచ్చునను విశ్వాస మెక్కడిది ? పోగా నా యౌషధయోగ మితరులకును కార్యకారి కాగలదనుట సంశయాస్పదమే !

6. ఈశ్వరప్రసాదిత పరమౌషధము నడిగెదవా? యని సిద్ధుడు కోపింపను వచ్చును ఒకవేళ నట్లే కోపించెనేని యతడీశ్వరానుగ్రహ పాత్రుడగు సిద్ధుడు కావున శపించుటయు సంభవము కాదనరాదు

7 ఇది యిట్లుండ "సాలగ్రామ"దానమునేని పట్టనొల్లని "అపరిగ్రహ" వ్రత నైష్ఠికు డగు ప్రవరు డొకరిని వాయి విడిచి గాని చేయి సాచిగాని యాచింపగలడా ? అది యతని శీలమునకే విరుద్ధముకదా !

8 ఒకవేళ పాదలేపన మతనికడ లేకున్నను లేదా తనయొద్దనున్న దాని నీయ నిష్టము లేకున్నను, సిద్ధుడా యౌషధయోగమునేని దెలిపి ప్రవరున కుపకారి కావచ్చును గదా ! ఐన దీనికొక ప్రతిబంధకము కలదు గురుప్రసాద లబ్ధములగు మంత్రతంత్రౌషధుల నెల్లరకు బోధించుట సంప్రదాయ విరుద్ధమనుట ప్రసిద్ధము సాధారణముగా తేలుమందు, తేలు మంత్రమువంటి వానిని గూడ శిష్యుడై దీక్షగొననిదే యీనాడు గూడ నుపదేశింపకుం డుట అనుభవ సిద్ధమే !

పాదలేపనము నా కిమ్మని పట్టున నడుగుటలో నిన్ని చిక్కులుండుట గమనించి ప్రవరునివంటివానిచే నట్లడిగించుట బూర్తిగా వదలివేసెను. కాని యట్లు విడిచిననెట్లు ? ప్రవరునకు గావలసిన దదియేకదా ! అడిగిన కష్టము ! అడుగకున్న నష్టము ! ప్రవరుని స్థితి యడకత్తెరలోని పోకవలె నుండెను ! ఇన్నినాళ్ళ కిట్టి మహిమోపేతుడు తన యింటికి వచ్చెను. కానో యనుదినము తీర్థయాత్రాభిలాషచే నుప్పొంగి యూర్పులు నిగుడ్చుచుండెను కోరిక యింత దృఢమైనను నతడు 'కాశికావళ్ళ' కట్టుకొని కాల్నడకతో తీర్థయాత్రలకు బోకాలడు. తనకో విద్యాగ్ని హోత్రాది నియమములు.

'సతో గృహే ద్విజాగ్రస్య నిష్పత్తిస్సర్వకర్మణామ్ ।
నిత్యనైమిత్తికానాం తు హానిరేవ ప్రవాసినః॥ (మా. పురా)

అనుటట్లు గృహము విడిచిన విప్రునకు కర్మహాని కలుగుట తథ్యము. పైగా దేవియు దేవరవోలె నింట ముదుసలి తలిదండ్రులు కూకటుల్ గొలిచి చేసిన కూరిమి బోమిదమ్మ అనుకూలవతియై మనసులో వర్తించు కులకాంత. ప్రవరుని వైరాగ్యము పరకాంతల పట్లనే. తోడు నీడలై చరించు శిష్యవర్గము. అధ్యయన అధ్యాపనములు, అతిథి సంతర్పణములు, నిర్మల ధర్మ కర్మ దీక్షానిరతంత్రత. ఇన్ని నియమనిగళములు గల ప్రవరునకు తీర్థ సందర్శనమునకు పాదలేపము కన్న పరమ శరణ్యమేది ? తాను గోరునదా తీర్థయాత్రాసందర్శన సమార్జిత పుణ్యవిశేషము. చేజిక్కిన ఈ యవకాశమును జారవిడుచుకొనుట యన సులభముగా రానున్న పుణ్యసంపదకు మోకాలొడ్డుటయే కదా ? ఇక నిట్టి విషమ పరిస్థితియందు ప్రవరు డేమి చేయవలెను ? ఎట్లు పలుకవలెను ? అయ్యా ! నాకు శైలకానన వినోదములు చూచు వేడ్కగలదు. పాదలేపన మిమ్మనుటయా ? కాదు. ఈ కోరిక నెరవేర్చి కృతార్థుని జేయుమని వేడుకొనుటా ? అసలేకాదు ఇక కర్తవ్యమేమి ?

ఔషధనామమును దాని మహత్వమును వినగనే ప్రవరుడు కౌతుక తరవ్యగ్రాంత రంగుడయ్యెను. అతని ముఖమున నొక నూతన వికాసము మొలకెత్తెను. అంతరంగమునకు మొగమద్దముకదా ! వెంటనే భక్తి వినమ్రాంజలి బంధురుం డయ్యెను. ఇది సిద్ధుని ప్రథమ దర్శనము కాదుగదా ! ఇప్పుడు నమస్కరించుటేల ? ఒక విన్నపము కలదని సూచించుటకే ఈ నమస్కార బాణము పిమ్మట ప్రల్లదములు క్షమింప వేడుకొని 'మునిలోక గ్రామణీ!' యని గొప్పగా సంబోధించెను దీనిచే సిద్ధుని మరింత ప్రసన్నుని గావించుకొని విన్నవించుటకు సెలవు వేడినట్లయ్యెను. ప్రవరు డిప్పటికిని భక్తివినమ్రాంజలియై అట్లు మోడ్పుకేలుతోడనే 'నను మీ శిష్యుని' యని పలికి యొకింతయుండి 'తీర్థయాత్రవలనన్ ధన్యాత్మునిగా జేయరే!" యని ప్రశ్న రూపకముగా మనవి చేసికొనెను "నను మీ శిష్యుని" యని పలుకుట వలన ప్రవరుడు గురుశిష్య సంప్రదాయములు దనకు దెలియుననియు, తాను సిద్ధునియందు గురుభావము కలవాడనియు, గురూపదేశమును గుప్తముగా నుంచగలవాడనియు దెలిపికొనినవా డయ్యెను. "తీర్థయాత్రవలనన్" అనుటచే తన కోరిక పుణ్య సంబంధమైనదనియు అవశ్యము తీర్పదగినదనియు, తనయందు దయజూపినచో తనయాత్మ ధన్యము కాగలదనియు దెలుపుకొనుచు "నను మీశిష్యుని తీర్థయాత్రవలనన్ ధన్యాత్మునిగా జేయరే" యని కడు దీనముగా ప్రార్థించెను. ధన్యాత్మునిగా జేయరే యనగా నిట ధన్యాత్మునిగా జేయరా ? యని చేతులు జోడించి భక్తితో జేసిన వినయ సంప్రార్థనము.

(శేషము)

కవిత:

# హంపయ్య

రచన. సేకరణ

కీ. శే. అల్లసాని రామనాథశర్మ శ్రీ గొట్టుముక్కల కృష్ణమూర్తి
అష్టావధాని

కత్తిని బట్టి నిల్చి పయి కాలుకదల్చుటలేదు నొత్తుమో
చత్తుమొ? లెక్కలేదనెడు శౌర్యవిధుల్లలచోటు విక్రమో
దాత్త మురారిరావు విలయం బొకనాడల గుత్తి డీల్పడెన్
దత్తర మందె తెల్లదొరదం డరుదెంచు నటన్న వార్తకున్.

దొర లరుదెంతురేని దయతో తమ కష్టము దీర్తురన్న సం
బరము లటుండ; స్త్రీలు తలవాకిలి దాటినచో ప్రమాదముల్
జరుగు నటంచు భీతితె ప్రజానికరంబులు కూలి గింజలున్
దొరక వటంచు కాపు పడతుల్ నిరుపేదలు వెచ్చ నూర్పుచున్.

పలువలు దేశ మెట్లు పరిపాలన చేసెద రేమి మాటలో
కలగకు మీవటంచు కులకాంతకు ధైర్యము సెప్పి, దైవమున్
దలచి నమస్కరించి ప్రజ ధర్మము దప్పిన నీవు లేవె మా
అలతలు దీర్పవే అనుచు హంపయ ప్రార్థన సేసె మాపటన్.

కూటికి తక్కువైన కులగోత్ర గుణంబులయందు నెక్కువై
పాటక వర్గమందతడు ప్రాభవముగా గడియించె చిన్నపూ
దోటను పెంచె, నాల్మగలతో గల గుంపెడు కాపురంబు నా
పూటకు పూట కెట్లొ గడపుం దన అంబలి తాను ద్రావుచున్.

నాటి దండు వచ్చు మాట వినంబడి
కలత చెందు జనుల గాంచి, లోన
నతడు నవ్వుకొనియె; హంపయ్య ఆత్మవి
శ్వాసమునకు నెలవు, శాంతమూర్తి.

ఇంతకు రేపుమాట కిపుడేల భయంపడ నంచు తాను వి
శ్చింతగ కుక్కిమంచమున జేర్చె మెయిన్ పవలెల్ల దోటలో
నంత శ్రమించి యుండుట నయత్నత గౌగిట దార్చి నిద్ర వి
శ్రాంతిని గూర్చె నాతనికి చల్లని గాడుపుకుఱ్ఱ వీవగన్.

దిక్కుల నెల్లమ్రింగి తెగద్రేచిన చీకటి రాజ్యమందునున్
జుక్కలు మిన్కుమిన్కు మనుచున్ బొడసూపుచు నింగిదేవుడే
దిక్కని వెల్గుచూపె వెనుదీయక శత్రువు వెంబడించుచో
జిక్కిన కష్టమౌననెడి చింత రవంతయు లేని తీరునన్.

వేగుచుక్కదోచె విచ్చె దమంబులు
వేవెలుంగు గగన వీథి దోచె
జనులు నిద్రలేచి పనులకు బూనిరి
ఇదియె క్రమము ప్రకృతి నెవ్వ డాపు?

అనుకొననట్లుగా జనము లబ్బురమందుచు చూడ నేలయీ
నినగతి నూరి వెల్పలను విల్చె పటాలము వచ్చి. భీతిమై
వనితలు లోనికేగి తలవాకిలి మూసిరి, వృద్ధపౌరు లె
ల్లను, కరణాలు, రెడ్లు దొరలం గననేగిరి కౌతుకంబునన్.

దొంగవలె ప్రవేశించుచు దొరగ మారి
గట్టునెక్కితిగదయని గర్వముమెయి
ప్రజల హింసించు రాజునుంబలె వినుండు
పుడమి భీటలువార విప్లవకలు గురిపె.

అయ్యెడ చెట్లకన్నిటికి నాదరమొప్పగ నీరువోసి హం
వయ్య క్రమంబు వాయ తలపాగను దాపలికేలదీసి, శ్రీ
ద్దయ్యె నటంచు బావికడ తద్దయు వేడుక జల్కమాడి ఆ
తియ్యని మావిసీడ తవ తెచ్చిన చల్దిభుజించె దృప్తిగాన్.

నాటికి నాటికిన్ బెరిగి నవ్వులు జిల్కెడి పుత్రునట్లు పూ
దోటను జూచి సంతసముతో తలయూచి యొకింత నిల్చి యీ
పాటికి విశ్రమింతునని భారము తీరిన యట్లు నిద్రకున్
వాటము గాగ మల్లెపొద పజ్జను చేరి పరుండె చల్లగాన్.

మది నొక చింతలేక నియమంబుల దప్పక సాధువృత్తిమై
హృదయము క్షీరవార్థి నొనరించిన ధన్యుడు కన్నుమూయుచో
నిదురకు తక్కువేమి? స్వవివిక్తల యోగ సమాధి మగ్నుడై
పొదలు సదాశివుండనగ బొందె మనోలయమున్ స్వతంత్రుడై.

ప్రొద్దువాలె, నూరిపెద్దలు రచ్చల
జేరి దొరల మాటతీరు, రూపు
సొబగు, మంచితనము సూచి దైవసమాను
లనుచు పొగడ దొడగి రచట నచట.

తొరగెడు బాష్పపూరములతోడ వివర్ణముఖాల భీతిమై
పరువులు వారుచో సడలబారెడు చీరల బిగ్గబట్టి యి
ద్దరు యువతుల్ త్వరంబడుచు తల్పును దీయుచు తోటజొచ్చి పి
ల్చిరి యెలుగెత్తి హంపయను, లేచెనతండును వెఱ్ఱిపీడుచున్.

"దొరలదె హంపయా! దొరలు ధూర్తులు మానమువోవ మమ్ములన్
జెరుపదలంచి వచ్చిరిదె, శీలముబోవు" నటంచు కాళ్ళపై
దొరలిన వారి యా ప్రబల దుఃఖము చూచి చలించి, అంతలో
దొరల దలంచె నంత; పగతోపగ వైకొని క్రోధమూర్తియై.

దీనత తన్నుచూచెడి సతీమణులన్ గని గ్రుచ్చియెత్తి, నా
ప్రాణము లిచ్చెదన్ గలగబారకుడీ యని చెప్పి క్రోధ మూ
ర్ధానన దుర్నిరీక్ష్య రభసాకృతి వాకిలిమూసి, వెల్వలన్
దాను విలంబడెన్ నయన తామరసంబుల విస్ఫులింగా గన్.

ప్రాణముతోడ నేను నిలువన్ దొరలేటికి దైవమేనియున్
మానినులన్ జెనంకి యవమానము సేయదలంచు టెట్లు ? దు
ర్మానియెవండు వచ్చినను రక్తము గ్రోలెద జీల్చి వైచెదన్
గాని యటంచు కృద్ధ భుజగంబయి హంపయ సూచె దిక్కులన్.

ఇరువురు శ్వేతవర్ణులు మదించిన కోడెలభంగి నున్న యా
దొరలరుదెంచి, దండధరు తుల్యుని హంపయ జూచి సంచలిం
చిరి క్షణమాత్ర, మామయిని "స్త్రీలిటు వచ్చిరి తోటలోనికిన్
జొరబడినారె ? తెల్పు"మన చూచె నతండు కృశాను కీలలన్.

చెరుపగ వచ్చినారు గద చేడియలన్ మగధీరు లార ! మీ
తెరవున మీరు పొందనుచు తీవ్రము దోపగ పల్కి, పచ్చి నె
త్తురు తెగ ద్రావు సైనికుల దుర్మద మింతయు లెక్కలేని యు
ద్ధుర భటు డాత్తరోషుడయి తూలి భుజంబులు రెండు పొంగగన్.

భారతదేశలక్ష్మి వలిపంబగు శీలము నయ్యెడం గొనం
గోరిరి కొన్ని రూప్యములకున్ దొర, లాతడు వెచ్చ నూర్చుచున్
వారిట లేరు పొందని యవారణ పొంగెడు క్రోధ మీగి తా
నూరక చూచె కొంతవడి యున్మదుడై లయకాల రుద్రుడై.

నిజము చెప్పుము లేకున్న నిన్ను గాల్తు
మిదిగొ పిస్తోలు చూడు మీవింక బ్రతుక
వనుచు ద్వారము వద్దకు జనెడి దొరల
నింక వాతడు చూచి సహింప లేక,

బెబ్బులి వోలె రేగి తలవెంట్రుకలన్ బిగబట్టి యీడ్చి పె
ల్లుబ్బిన క్రోధవేగమున నొక్కని నాలుక దోచి, 'చూడు నా
దెబ్బ, మదాంధ! ప్రాణములు తీసెద వాకిలి తీయుమింక నీ
అబ్బకు చేతగాదు' పరమాత్ముడు వచ్చిన జీల్చి వైచెదన్.

అవినంతనె వేరొక డా
తని బలిమిం జదియమోదె దర్పోద్ధతుడై
వెనుదిరుగుచు హంపయ్యయు
పెనగొని యిద్దరిని బట్టి పెడబొబ్బలిడెన్.

సైనికు డొక్క డుద్ధుర భుజాబలు డంతట బిట్టదల్చి రో
షానల దహ్యమానుడయి హంపయ కంఠము నొక్కిపట్టగా
వాని సఖుండు కాళులను బట్టుచు నేలకు నీడ్వజూచె బి
ట్టూవిన కాలినెత్తి యతడొక్కటె తాచె యురంబు వ్రీలగన్.

పగ బూనిన దన్నాగెడు
మగ వాడెవ్వండటంచు మార్కొని యొకనిన్
సిగపట్టి నేలకీడ్చెను,
పొగరడగగ వాని వక్షమున గూర్చుండెన్.

రేగిన సింగమై నిలువరింపగరాని పరాక్రమంబుతో
నీగతి యింకచూడుమని నెట్టన కంఠము నొక్కి పట్టుచున్
ద్రాగెద నింక నెత్తురును ద్రాగెద నిక్కము లెక్కసేయ నే
దేగతి వచ్చెనేని సరియే యనియెన్ వెడనవ్వు నవ్వుచున్.

అసట ఝూట భయద పంచాస్య వదన
మామహోద్దామ బల రభసాకృతి గని
జగములు వడంకె నెచ్చెలి చచ్చునంచు
తెల్లదొరలెల్ల బోయి నిల్వెల్ల బెదరి.

ఆలస్యంబున ముప్పు దప్పదని ధైర్యంబూని వేవేగ పి
స్తోలం దీయుచు వెన్కకున్ జనియె ముందున్నించి కాల్చెన్ మహా
ఖీలాగ్నిచ్ఛట లీను గుండు పిడుగై వ్రేలంగ హంపయ్యయున్
వ్రాలెన్ నేలకు దూలుచున్ రుధిరధారం జిమ్ము వక్షమ్ముతోన్.

కొనల చెంగావితో మొనసూపి వీనుల
గనుచున్న కడుగొప్ప కనులవాని
గుబురు మీసలలోన గుస్తరించిన నవ్వు
మురువు సూపుచునున్న మోమువాని
ఉక్కు రోకళ్ళన నొప్పి మోకాళుల
చమిరెడి బాహు దండములవాని
కరగబోసిన మేటి గంఢ్రతనం బన
విరిసిన బలితంపు టురమువాని

ధర్మదీక్షయు దృప్తియు దాంతి శాంతి
ఉట్టి పడుచున్న హంపయ్య నుజ్జ్వలాత్మ
బురపురన్ బొక్కుచున్ గుత్తి పురజనంబు
కాంచె కడసారి కన్నీరు గార్చుకొనుచు.



తమిళ ఏకాంకిక :

# కాళిదాసు కవి సందర్శనము

శ్రీ కి. రా.

[గదిలో పెద్దపెద్ద సోఫాలు గోడమీద శ్రీరామచంద్రుని పటం. కొంచెం దూరంలో గుమాస్తా కుర్చీ, టేబిలు. టేబిలుమీద పెద్దపెద్ద రిజిష్టర్లూ ఉంటవి.

సోఫామీద గణేశమల్లు కూర్చొని రిజిష్టర్లుచూస్తూ ఉంటాడు ద్వంద్వశరీరం. చొక్కా, దానిమీద జవహర్ బండీ గుండీలు లేకుండా వదులుగా ఉంటుంది. పెద్ద పెద్ద మీసాలు, కళ్ళకు అద్దాలు ఎదుట విశ్వనాథ్ నిలబడి ఉంటాడు.]

గణేశమల్లు · ఇదేమిటి ? ఇరవైరెండు రూపాయలు నిన్నటి పెట్రోలు లెఖ్ఖలో వ్రాశావు? నిన్న షూటింగు జరగలేదుగదా ?

విశ్వనాథ్ దామలేగారు నిన్న మహాబలేశ్వరపురం వరకు వెళ్ళి వచ్చారండీ ; పెట్రోలుఖర్చు చిఠ్ఠాలో వ్రాయమన్నారు.

గణేశ. ప్రతినెలా ఇట్లానే జరిగితే ఇక కంపెనీ మూసివేసుకోవచ్చును.

విశ్వ అదుగో వారు వస్తున్నారు

(బయట కారువచ్చుడు వినబడుతుంది దామలే, ఖ్వాజా ఇద్దరూ లోనికి ప్రవేశిస్తారు.)

దామలే · నమస్తే.

ఖ్వాజా ఆదాబ్ అర్జ్.

గణేశ . నమస్తే, నమస్తే రండి, రండి, (విశ్వనాథ్‌చేతికి రిజిష్టర్లు యిచ్చి) ఇవి తీసుకొని పో. మిగతా విషయాలు తరువాత చూచుకుందాం.

ఖ్వాజా : ఏమండీ ఏమిటిసంగతి ? ఇవాళ షూటింగు లేనట్లేనా ?

గణేశ షూటింగు జరిగేదెట్లా ? హీరోకు కడుపులో నొప్పి వచ్చిందట. రావని కబురంపించాడు. "సెట్" అంతా తయారయింది. రేపు పూనా పోతానని హీరోయిన్ కబురంపించింది. అక్కడ ఆమెకు షూటింగు ఉన్నదట.

దామలే : అయితే మనకు చాలా నష్టం వస్తుందే!

గణేశ ఎంతమంది కాళ్ళు పట్టుకొంటేనోగాని ఫిలిం పూర్తికావడం లేదు. పేపరు వాళ్ళు చూశారూ, ఒక వాక్యంలో ఫిలిం ఫైల్యూర్ అయిపోయిందని వ్రాసి పారేస్తారు. మనం పడే కష్టాలు వాళ్ళ కేమి తెలుసు ?

*(నౌకరు వచ్చి నిలబడతాడు)*

గణేశ . ఏమిటి సంగతి ?

నౌకరు ఆయన ఈరోజుగూడా వచ్చారు సార్.

గణేశ. ఎవరు?

నౌకరు ఆదే రోజూ వచ్చేఆయన సార్ ! పెద్దది గడ్డం ఉంది సార్ !

దణేశ . మాకు తీరికలేదని చెప్పు. పో.

ఖ్వాజా *(మాటకు అడ్డంవచ్చి)* ఎవరు ?

గణేశ . ఎవడో కథలు వ్రాసేవాడట.

ఖ్వాజా చూద్దాం. కథ బాగాఉంటే తీసుకుందాం, ఇంకొక ఫిలిమ్ తీయవచ్చును.

దామలే చేతిలో ఉన్న ఫిలిమ్ పూర్తిచేస్తే అదే పదివేలు.

ఖ్వాజా . భగవంతుని దయఉంటే అంతా సరిగ్గానే జరుగుతుంది. *(నౌకరుతో)* ఆయనను లోపలికి పంపించు

*[నౌకరు వెళ్ళిపోతాడు. క్షణకాలం తరువాత మహాకవి కాళిదాసు లోపలికి ప్రవేశిస్తాడు పొడువైన వెంట్రుకలు. లలాటంమీద చందనం. శరీరం మీద వట్టు వస్త్రాలు. భుజాలమీద శాలువ నిండైన విగ్రహం లోపలికి ప్రవేశించి నలు వైపులా పరికించి చూస్తాడు ]*

గణేశ . కూర్చోండి.

*[కాళిదాసకవి భయపడుతూ సోఫామీద కూర్చుంటాడు]*

గణేశ : ఏమి కావాలి ? చెప్పండి.

కాళి ఇక్కడ చలనచిత్ర నిర్మాణం జరుగుతున్నదని తెలిసింది. నాకోరిక ఏమంటే నేను వ్రాసిన కథను...

గణేశ . ఇంతకు పూర్వం ఏఫిలిమ్ కొరకైనా మీరు కథలు వ్రాశారా ?

కాళి : అయ్యా ! ఈ దాసుడు అనేక నాటకాలు వ్రాశాడు. అనేకమైన కావ్యాలు వ్రాశాడు.

గణేశ : కావ్యాలు మాకెందుకు ? మాకు మంచి కథ కావాలి. చెప్పండి మీదగ్గర....

కాళి: ఇంత తేలికగా మాట్లాడడం మీలాంటి వారికి న్యాయంకాదు. నేను వ్రాసిన నాటకాలను చదివి వేలకొలది విద్వాంసులు ఆనందిస్తున్నారు.

గణేశ. విద్వాంసులు ఆనందిస్తున్నారా? అయితే కథ ఉదాత్తంగా ఉన్నదన్నమాట. ఆకథ సామాన్యుల కేమి అర్థమవుతుంది? సామాన్య జనానికి కథ వచ్చి తేనేగాని ఫిలిం జయప్రదంగా నడవదయ్యా!

ఖ్వాజా సరే, అయితే కవిగారూ! మీకథ సోషలా, లేక హిస్టారికలా?

[కాళిదాస కవికి అర్థంకాదు]

దామలే. మీకథ ఈ కాలం నాటిదా, లేక పురాతన కాలం నాటిదా?

కాళి. నా రచనలు దేశకాలాతీతాలు సర్వకాలాలలో సర్వజనులనూ ఆనంద పరవశులను చేయగలవు

గణేశ అది సరే లేవయ్యా! మీ కథ మీకు బాగానే ఉంటుందిలే ఫిలిం తీయ డానికి సంచులు కావాలి, డబ్బు సంచులు తెలుసునా?

కాళి కాదుస్వామీ! మీరు కొంచెం ఓపికపడితే చదివి వినిపిస్తాను. (చేతిలోని దస్త్రాన్ని తీయబోతాడు)

ఖ్వాజా తరువాత వింటాములెండి. మీకథ పాదుషాలకూ, వారి భార్యలకూ సంబం ధించినదా, లేక మామూలు సామాన్యులకు సంబంధించినదా?

కాళి రాజవంశాలలో జన్మించిన వీరులకూ, తపోనిష్ఠా గరిష్ఠులైన మునులకూ, అప్సరసలకూ అందరికీ నా కథలో స్థానమున్నది.

ఖ్వాజా లవ్‌సీన్లు ఎన్ని ఉన్నవి?

కాళి ప్రశ్న నాకర్థం కాలేదు.

ఖ్వాజా. లవ్ అంటే ప్రేమ హీరో హీరోయిన్ ఇద్దరూ వెన్నెల రాత్రిలో ఏ తోటలోనో కలుసుకొని పాటలు పాడడం, ఆడుకోవడం, వొళ్ళు పుల కరించేటట్లు మాట్లాడడంలాంటి సీనులేమైనా ఉన్నవా? అవి నా ప్రశ్న.

గణేశ ఇక చాలు లేవయ్యా, నీకథా వీపూను. లవ్ అనే మాటకే అర్థంతెలియని వాడివి సినిమా కథలు వ్రాస్తానని బయలుదేరావు.

కాళి. నాయికా నాయకులకు సంబంధించిన శృంగారలీల లని మీ అభిప్రాయమా?

ఖ్వాజా. అవును. అదే.

కాళి. ఒక్క శృంగార రసమేమిటి? శోక, రౌద్ర, వీర, భయానకాది రసాలన్నిం టికీ నా నాటకాలలో స్థానమున్నది నేను మహా కావ్యాలు వ్రాశాను.

ఖ్వాజా ఇన్నిరసాలూ ఒకే కథలో కలిపితే ఫిలిం మనోరంజకంగా ఉంటుం దంటారా? మీ అభిప్రాయ మేమిటి?

గణేశ ఆవన్నీ ఈనాటి పరిస్థితులకు సరిపోవు. ఈనాటి ఫిలిమ్‌లలో— సంభాషణ లలో తీవ్రత ఉండాలి. అభినయంతో దర్శకుల హృదయాలలో తుపాన్లు రేగాలి. అడుగడుగునా ప్రభుత్వాన్ని విమర్శించాలి అనాడే ప్రజలకు ఫిలిం నచ్చుతుంది. లేకపోతే కంపెనీలు దివాలా తీయవలసిందే.

దామలే. అవును బాగా చెప్పారు ధనవంతులనో భగవంతుణ్ణో నోటికి వచ్చినట్లు తిడుతూ ఉండేటట్లుగా డైలాగ్సు వ్రాయాలి బీదవాళ్ళపక్షం వహిస్తూఉండే రెండు పాటలైనా కనీసం వ్రాయాలి. ఇక చూసుకో, ఫిలిం బంగారపు వర్షాన్ని కురిపిస్తుంది.

కాళి. తమ మాటలు నాకు బోధపడడంలేదు.

దామలే మీకు ఇంగ్లీషు వచ్చునా? ఎంతవరకు చదువుకొన్నారు?

కాళి: వ్యాకరణం, మీమాంస, వేదవేదాంత, నాటక, కావ్యాలంకార

దామలే చాలు చాలు ఆపండి.

కాళి తమ అభిప్రాయం .

గణేశ అభిప్రాయమేమంటే కథలో సంభాషణలు జోర్‌దార్‌గా ఉండాలి.

కాళి నా రచనను చదివి వినిపించనా? గోక్షీరమువలె మధుర సంగీతం వలె శ్రోతలను .

దామలే అదినరేగాని మీ కథలో ఎంతమంది చస్తారు?

కాళి · చస్తారా?

దామలే అవును కథలో ఏ పాత్రా చావదా? అందరూ బ్రతికి ఉంటారా?

కాళి నా పాత్రలన్నీ అమరత్వాన్ని పొందినవి. నేను నిర్మించిన పాత్రల నాధా రంగా చేసుకొని అలంకార శాస్త్రీయులు రచించబడ్డవి.

దామలే. అబ్బా! మీతో చావుగా ఉందండీ. కథ ట్రాజడీ కాక పోతే ప్రేక్షకులు కన్నీరు కార్చేదెలా? ఫిలింలో ఒక్క కన్నీటి బిందువు వేలు సంపాదించి పెడుతుంది.

ఖ్వాజా : కథలో ఆకర్షకమైన డైలాగ్స్ లేకుండానూ, ఎవ్వరూ చావకుండానూ ఉంటే జనానికి నచ్చే దెట్లాగయ్యా ! కనీసం హీరోయిన్ నెత్తిమీద ఆపదలమీద ఆపదలన్నా వచ్చి పడకవా ?

కాళి · హీరోయిన్ అంటే ?

ఖ్వాజా · హీరోయిన్ - హీరోయిన్ - అంటే తెలియదయ్యా ?

గణేశ్ : అంటే ఏక్ట్రెస్ - నాయిక

కాళి . నాయికా ? నా నాయిక అనేక కష్టాల పాలవుతుంది. ఆమెను భర్త మరచిపోతాడు.

ఖ్వాజా · రైట్. బాగున్నది. పిల్లవాణ్ణి వెంటబెట్టుకొని ఇంగ్లీషు ట్యూన్‌లో మంచి పాట పాడుకుంటూ ఇల్లిల్లూ తిరిగి బిచ్చ మెత్తుకుంటుందా ? దోవలో ఒకడు ఆమెను అవమాన పరచబోతాడు. ఆమె ఏడిచి ఏడిచి వాడి బారినుండి తప్పించు కొంటుంది తరువాత మిఠాయి అమ్ముతుంది. అక్కడ గూడా ఒక ధనవంతుడు ఆమెమీద కన్ను వేస్తాడు తరువాత తరువాత

దామలే . ఆ ధనవంతుని బారినుండి తప్పించుకొని కిల్లీకొట్టు పెట్టుకొంటుంది. ఒకరోజున ఆమె పిల్లవాడు మోటరుకింద పడి చచ్చిపోతాడు పిల్లవాడి శవాన్ని భుజంమీద వేసుకొని దుఃఖంగా పాడుకొంటూ ఆమె నడి బజారులోనుండి పోతూ ఉంటుంది. ఇంతలో పెద్దగా వర్షం వస్తుంది. వర్షం వెలిసినదాకా ఒక మేడ ప్రక్కన ఆమె నిలబడుతుంది. మేడమీదనుండి ఒక ధనవంతుడు ఆమెనుచూచి ముగ్ధుడై పోతాడు.

కాళి : ఛీ ! ఛీ ! అంత అన్యాయమా ? అలాంటి దృశ్యాలను చిత్రించడం పాపకృత్యం

ఖ్వాజా : అది పాపకృత్యమైతే నంచులు విందే దెలాగయ్యా !

కాళి · నా నాయిక తనను మరచిపోయిన పతిదేవుని ముందుకు వెళ్ళి - 'నాథా ! నన్ను మరచిపోయినావా ?' అంటూ కళ్ళలో నీళ్ళు కళ్ళలో కుక్కుకుంటుంది,

ఖ్వాజా . ఏడ్చినట్లుంది. ఇలాంటి కథతో ఫిలింతీస్తే వెర్రెత్తిక చేతులే.

కాళి : మహాప్రభూ, నేను కావ్యశాస్త్రాదుల నుల్లంఘించి నాటకం వ్రాయలేను.

ఖ్వాజా : మీ కవులందరికీ ఇదేరోగం. ఇది జన్మతోనే పుట్టుకుందనుకుంటాను.

గణేశ : అనుభవహీనుడవు. కవీః ఇట్లాగైతే నీకు రెండు దమ్మిడీలు గూడ పుట్టవు.

కాళి. నా కథను ఒక్కసారి చిత్తగించండి. తరువాత మీ అభిప్రాయం చెప్పుదురు గాని విశ్వామిత్రమహర్షి తపస్సు చేస్తుంటాడు. దేవేంద్రుడు తపోభంగం చేయడానికి మేనకను పంపిస్తాడు. ఆ మేనక నృత్యాన్ని చూచి వనదేవత గూడా విస్మయవిముగ్ధురా లవుతుంది. భయంకరమైన వనజంతువులు తమ హింసాప్రవృత్తిని మరచిపోయి ఆ నృత్యాన్ని తల్లీనంగా చూస్తూ ఉంటవి.

గణేశ ఈ కథను . . .

దామలే ఎక్కడో విన్నామే!

ఖ్వాజా రామాయణంలో

దామలే కాదు, కాదు, భాగవతంలో.

కాళి నాయీ కృతిపేరు శాకుంతలం.

దామలే అవునవును 'శాకుంతలనాటకం జ్ఞాపకానికి వచ్చింది. శాకుంతల నాటకం మీద ఇదివరకే ఫిలిం తీయబడిందిగదా! కథ చాలా ఓల్డ్ మాడల్.

కాళి అంటే?

ఖ్వాజా పాతకథ అని అర్థం.

కాళి పాతదని కథను వదలివేస్తామా?

ఖ్వాజా ఈ కథను మీరే వ్రాశానంటారా? ఇది దొంగతనం

కాళి కాదండీ; ఇది నా రచనే. మీరు ఈరచనను ఎన్నిసార్లయినా చదవండి. మీకు విసుగు కలుగదు. మిగతాకథ వినండి.

గణేశ ఇక ఆపవయ్యా! ప్రొద్దున్నేవచ్చి మా ప్రాణం తీస్తున్నావు

కాళి వినండి ప్రభూ! తత్పశ్చాత్

గణేశ . ఈ పౌరాణిక కథలు మా కక్కర్లేదయ్యా!

ఖ్వాజా : ఇప్పటికి దయచేసి వెళ్ళండి కవిగారూ! ఈసారి మంచి సోషల్ కథ వ్రాసుకొనిరండి. చూస్తాం.

కాళి : ఈ కథను పూర్తిగా చిత్తగించండి. తరువాత దోషాలుంటే—

గణేశ . మీ చెత్తఅంతా వినడానికి మాకు తీరికలేదయ్యా!

కాళి: మీకు వినడానికి ఓపిక తీరిక లేకపోతే, సరే, ఇదంతా చెత్త అనిమాత్రం అనకండి.

గణేశ: సరే, సరే . ఇక దయచేయండి ఎవరురా?

*(అభినేత్రి నిరంజనాదేవి మెరుపుతీగవలె లోపలికి ప్రవేశిస్తుంది. కాళిదాసు నిర్నిమేషంగా ఆమె వైపుకు చూస్తుంటాడు మిగతా ముగ్గురూ లేచి ఆమెకు స్వాగతం చెవుతారు.)*

గణేశ
దామలే } రండి దయచేయండి
ఖ్వాజా

గణేశ విశ్వనాధ్: నిరంజనా దేవిగారికి కాఫీ

నిరం: ఏమండీ! ఈరోజు షూటింగు లేదట. రేపటినుండి నాకు వీలులేదు నేను రేపు పూనా వెళ్ళిపోతాను

గణేశ మీరు అలాఅంటే ఎట్లా? సెట్టు తయారుగా ఉన్నది. ఇక రెండు రోజులుంటే చాలు పని పూర్తి అయిపోతుంది లేకపోతే పని చాలా చెడిపోతుంది

ఖ్వాజా అవునండీ రెండులోజులు కేవలం రెండు రోజులు.

దామలే మీరు దయయుంచి రెండు రోజులు.

నిరం: క్షమించాలి మీకోరికను మన్నించడం అసంభవం సెలవు, వెళ్లుతున్నాను. ఇప్పటికే చాలా ఆలస్యమయింది

*[తొందరగా బయటికి వెళ్ళిపోతుంది వెనక వెనక ముగ్గురూ పరుగెత్తుతారు]*

గణేశ. ఏమండీ! ఏమండీ!

దామలే: నిరంజనాదేవిగారూ! నిరంజనాదేవిగారూ!

*[కాళిదాసు ఆశ్చర్య చకితుడవుతాడు విశ్వనాధ్ ప్రవేశిస్తాడు]*

కాళి: ఒక ప్రశ్న అడుగుతాను జవాబు చెప్పుతారా?

విశ్వ. ఏమిటా ప్రశ్న?

కాళి: ఈ ముగ్గురి మెదడూ పనిచేస్తుందంటారా? ఏమైనా చెడిపోయిందా?

విశ్వ: ఎందుకు అట్లా అడుగుతున్నారు?

కాళి: మంచి విషయాలేవీ వీరి తలకు ఎక్కేటట్లు లేవే!

విశ్వ మీరు గుప్తయుగంనాటి మనుష్యులు. ఆరోజులు ఇపుడు మళ్ళీ రమ్మంటే ఎట్లా వస్తవండీ ! ఈ రోజుల్లో సరుకు ఎట్లా ఉన్నా ప్రచారం ఎక్కువ కావాలి, ఇది ప్రచార యుగమండీ

కాళి ప్రత్యక్షంగా కనిపిస్తున్న దానికి గూడా ప్రచారమెందుకు ? సూర్యుని ప్రకాశానికి గూడా ప్రచారం కావాలా ?

విశ్వ అయ్యా ! ఇది సినిమా యుగం స్వయంగా సూర్యభగవానుడొచ్చి వేషం కావలెనన్నా మీరు ఇదివర కెన్ని సినిమాలలో వేషం వేశారనే మొదటి ప్రశ్నకు జవాబు చెప్పక తప్పదు. స్టార్‌కు ప్రసిద్ధి ఉంటేనేగాని డబ్బు రాదు గదా ! బహుశా మీరు మాట్లాడే సంస్కృతం మా యజమానులకు అర్థం గూడా అయిఉండదు. నా మనవి విని మీ రచనలను ఏదైనా సాహిత్య పరిషత్తులో చదివి వినిపించండి ఈ సినిమా ప్రపంచంలోని జనమంతా ఇదే రకంగా ఉంటారు మీవంటి మహాకవులకు ఇక్కడ స్థానం లేదండి. దయచేయండి.

కాళి . బాగున్నది బాగున్నది ఈ ప్రపంచమే విచిత్రంగా ఉన్నది

[ తెరపడిపోతుంది ]

---

కవిత :

# సంధ్యారవము

శ్రీ బెళ్లూరి శ్రీనివాసమూర్తి

తల్లుల బిలుచు వత్సముల యంబారవం
బరసి ధేనువు లిచ్చు ప్రతి రవమ్ము
బారులు దీరి యంబర వీథి తమ కులా
యముల కేగెడు విహంగారవమ్ము

పొలములయందు దవ్వుల నున్న కర్షక
　　జనము లొండొరు బిల్చుకొను రవమ్ము
గిరిసాను తలముల నొరసి యేతెంచు ని
　　ర్ఝరిణి యవ్యక్త మర్మర రవమ్ము
గలగల తరుశాఖికల శుష్కమగు పత్ర
　　తతి డుల్చు మందమారుత రవమ్ము
కదుపుల మరలింప గడగు గొల్లలు వన్య
　　సీమ నెల్గించు వంశీరవమ్ము
ప్రసవించు కుసుమ గర్భములందు మధుకరో
　　ద్గాత ప్రశాంత ఝుంకార రవము
ప్రియ విరహ వ్యథోద్భిన్న మానస సుధా
　　తరళిత ప్రేమ గీతారవమ్ము
ధ్యానైక పరవశత్వము నందుకొను యోగి
　　యెలుగెత్తి పరమేశు బిలుచు రవము
శ్రవణ కఠోర నిరంతర స్వనిత ఘో
　　రారణ్యవీథి ఝిల్లీ రవమ్ము
భగ్న నిద్రాన్విత స్వప్న జన్య పికార్భ
　　క ప్రేమ మాధురీ గళ రవమ్ము
హృదయ ద్రవీభూత మృదుల మోహనభావ
　　లీలాంకురిత కురరీ రవమ్ము

తత్త్వమున మేలుకొల్పి సౌందర్య భావ
గతులు గీల్కొల్పి శాశ్వతస్థితిని దెల్పి
వలయు పరమార్థముల నెల్ల వెలువరించె
తప్తహృదయాంతరమున సంధ్యా రవమ్ము.



వ్యాసము :

# గీతార్థము

శ్రీ ఎక్కిరాల కృష్ణమాచార్యులు, యం. ఏ.

*యత్ర యోగీశ్వరః కృష్ణోయత్ర పార్థో ధనుర్ధరః*
*తత్ర శ్రీ ర్విజయో భూతిః ధృవా నీతి ర్మతి ర్మమ.*

అపౌరుషేయములు, భారతీయ సంస్కృతి సర్వస్వములునగు వేదముల సారమని బహుముఖముల పొగడ్త గన్న మహాభారతము పంచమ వేదమయి ఆశ్రయించినవారికి కల్పవృక్షమై వ్యాపించినది. కాలక్రమమున మానవ మాత్రులకేర్పఱుపరానిదై కలసిపోయిన ఆమ్నాయ ప్రపంచమును భగవచ్ఛబ్ద వాచ్యుడగు వేదవ్యాసు డవతారమంది, శాఖలు విడదీసి మానవుల కందించెను. మఱియు రాబోవు యుగములవారు వేదపురుషుని సమగ్ర స్వరూపమును సాక్షాత్కరింప జేసికొనలేరని యెఱిగి యందలి సారమంతయును లౌకికమగు ఛందస్సముదాయము నిమిడ్చి లోకహితార్థమై భారతము నవతరింప జేసినాడు. అది పదునెనిమిది పర్వముల సంఖ్యగలిగి, యేవిధమగు విజ్ఞానము కావలసిన వారికైనను లేదనక అందిచ్చుచున్నది. ఈ పదునెనిమిది పర్వముల వేదపురుషుని గర్భములో మఱియొక పదునెనిమిది యధ్యాయములుగల శాశ్వత పురుషు డొక డున్నాడు. అతడే గీతా స్వరూపుడు. భారతాంతర్గతమగు భీష్మ పర్వములోని ఈ భగవద్గీత భారత దేశమునందే గాక యావత్ప్రపంచమున గల జిజ్ఞాసువులచేతను, ముముక్షువులచేతను తెలిసికొనబడి విశ్వవ్యాప్తమైనది. ఉపనిషత్తులు, వేదమంత్రములతోపాటు భగవద్గీతకు స్థానమున్నది. అంతేగాక సర్వోపనిషత్తుల సారమే గీతయని గూడ వ్యాస భట్టారకులే చెప్పియున్నారు. భగవద్గీత ఉపనిషత్తుగను, యోగశాస్త్రముగను, బ్రహ్మ విద్యగను అధ్యాయాంతములయందే చెప్పఁబడియున్నది. మఱియు భక్తి ప్రధానమైన మార్గముగలవారు కొందఱు గీతాపారాయణము సకల పాపహరమనియును, జీవులకు సాంసారికమగు బాధలను తొలగించి నిశ్శ్రేయస పొందించునని ఆపత్కాలములయందుగూడ చదువుకొందురు. ఉపాసనా మార్గముగలవారు దీని నొక మంత్రవిద్యగా స్వీకరించి అంగన్యాస కరన్యాసములతో పురశ్చర్య విధాన మన

లంబించి షట్ప్రయోగ విధులయందుగూడ వినియోగించుట గలదు. ఇది యిట్లుండ శ్రీకృష్ణభగవానుఁడు యుద్ధభూమిలో నర్జునునకు గీతోపదేశము చేయుటయందలి వైభవమునుగూర్చి సంజయుడు ధృతరాష్ట్రునితో చెప్పుచు మైమరచి పులకరించినాడు.

"ఇత్యహం వాసుదేవస్య పార్థస్యచ మహాత్మనః ।
సంవాద మిమ మశ్రౌష మద్భుతం రోమహర్షణమ్॥

వ్యాసప్రసాదాత్ శ్రుతవా నేత ద్గుహ్య మహం పరమ్ ।
యోగం యోగేశ్వరా త్కృష్ణా త్సాక్షా త్కథయతః స్వయమ్॥

రాజన్ సంస్మృత్య సంస్మృత్య సంవాద మిమ మద్భుతం ।
కేశవార్జునయోః పుణ్యం హృష్యామి చ ముహుర్ముహుః॥"

ఈ శ్లోకములవలన మీ బ్రహ్మవిద్యకుగల సంప్రదాయ మిచ్చట స్ఫురింప జేయబడినది ఈ సంవాదరూపమగు మహావిద్యకు వ్యాసుడు ఋషి ఈ విద్య పేరు యోగవిద్య యోగేశ్వరుడగు కృష్ణుడు దైవము దీనిని భావన చేయుకొలది యును పులకలుగలిగి తన్మయత్వము సిద్ధించును దీనికాచార్యుఁడగు వేదవ్యాసుఁడే మంత్రి రహస్యముగా గీతనుగూర్చి తన మహా భారతమున నిట్లు జెప్పినాఁడు.

"గీతా సుగీతా కర్తవ్యా కిమన్యైః శాస్త్ర సంగ్రహైః ।
యా స్వయం పద్మనాభస్య ముఖపద్మా ద్వినిస్సృతా॥

సర్వశాస్త్రమయీ గీతా సర్వదేవమయో హరిః ।
సర్వతీర్థమయీ గంగా సర్వవేదమయో మనుః॥

గీతా గంగాచ గాయత్రీ గోవిందేతి హృది స్థితే ।
చతుర్గకార సంయుక్తే పునర్జన్మ నవిద్యతే॥"

ఇచట భారత సంహితనుండి యుద్ధరింపఁబడిన గీతా మహామంత్రమునకు బీజాక్షరములుగ నాలుగు " గకారములు " ఉద్ధరించినాడు. ఇచట మఱియొక చమత్కారముగూడ నున్నది. మహాభారతమును అక్షరస్వరూపమున నేర్పఱచిన వాఁడు గణాధిపతి. అందువలన మంత్రశాస్త్రములోని మహాగణపతి విద్యా రహస్య మిచట సంపుటీకరణము చేయబడినది దీనినిబట్టి చూచినచో మహా భారతమంతయు గీత కొకవిధమైన వ్యాఖ్యానమని తోచును. వ్యాసభారతము నామూలాగ్రముగ చదివి దర్శనము చేసికొనిన వారికి మహాభారతము, గీత యనునవి జీవాత్మ పరమాత్మలవలె సాక్షాత్కారమగును. బాహ్యలక్షణములుగూడ

భారతమునకు పదునెనిమిది పర్వములు; గీతకు పదునెనిమిది యధ్యాయములు. భారతమున కాలపురుషుని పాత్ర గీతలో శ్రీకృష్ణుని స్వరూపముగా గోచరించును. పాండవులకు ధర్మజుని ద్వారా ఆయా సమయములయందు ప్రత్యక్షమై కర్తవ్యమును బోధించుచు వచ్చి, ఆదిని సరమ కుమారుఁడగు కాలభైరవ స్వరూపుడుగా కన బడి కావ్యాంతమున సారమేయ రూపుడై స్వర్గారోహణము దాక వెంటవచ్చిన యముఁడు కాలమునకు స్థూలమగు స్వరూపము ఆ మహాభారతముననే సకల భూభారమును బాపుటకై అవతరించిన నీలస్వరూపుడగు కృష్ణుడు ఈకాలు నతిక్ర మించిన యవ్యక్త తత్వము ఈ తత్వమంతయును నర్జును నాధారముగా జేసికొని కురుక్షేత్ర సంగ్రామమున రెండు సేనల నడుమ జరుగు చుండు శాశ్వత యుద్ధమున తన తత్వమును వాగ్రూపమున వ్యక్తము జేసెను ఈ విధముగ నే దృష్టితో జూచినను మహాభారతమను విశ్వరూపమును, భగవద్గీత యను పురుషోత్తమ స్వరూపమును గోచరించుచునే యుండును. నిశ్చయముగ భారతమే భగవద్గీతకు గ్రంథకర్త రచించిన మొదటి వ్యాఖ్యానము అందువలన భగవద్గీతను వేరుగ వచించి వ్యాఖ్యానములు వ్రాయబూనినచో నేటి కొందఱు రాజకీయ వేత్తలు భగ వద్గీతను గూర్చి యుపన్యాసములు తయారుచేసి పేరు సంపాదించినట్లుండును.

ఈ భారతమునకు సమగ్రమగు వ్యాఖ్య వ్రాసిన శ్రీ నీలకంఠులు మొదలగు మహా విద్వాంసుల భగవద్గీతా వ్యాఖ్య చాల సమగ్రము, సమంజసమునై యొప్పు చున్నది నీలకంఠ పాదుల మతమున సంప్రదాయము లేనిది గీతకర్థము చెప్పుట తప్పని చెప్పబడి యున్నది ఈయన తన గీతా వ్యాఖ్యప్రారంభమున నిట్లు చెప్పినాఁడు

"ప్రణమ్య భగవత్పాదాన్ శ్రీధరాదీం శ్చ సద్గురూన్
సంప్రదాయానుసారేణ గీతా వ్యాఖ్యాం సమారభే "

శ్రీధర నీలకంఠుల మతమున గీతలోని బ్రహ్మవిద్య యంతయు కర్మ, జ్ఞాన, భక్తులను మూడు కాండలుగ విభజింపబడినది. దీనిలో భక్తియనబడు నుపా సనా కాండను మించినది లేదనియును, గీతలోని యారేసి యధ్యాయము లొక్కొక్క కాండకు సరిపడు ననియును చెప్పఁబడి యున్నది. అందువలన గీత కేవలము కృష్ణు డర్జునునకు బోధించిన యుద్ధరంగములోని యుద్బోధయే గాక సమస్త సృష్టి రహస్యమగు బ్రహ్మవిద్యా సర్వస్వమని తెలియుచున్నది. ఈ విష యమునే అనిబిసెంటు తన గీతోపన్యాసములలో నిట్లు చెప్పినది. " To speak of

the Gita is to speak of the History of the World,.........for the book is not simply the story of the teaching of Arjuna by Sri Krishna ... and all that one can pray in taking up a task so far beyond one's powers is that that flute, whose music compelled melody even from the very stones that heard it may breath the same all-compelling music in the heart of speaker and hearers alike .. not only in its own native land but over all lands, that music has gone and in every country has awakened some echo in receptive hearts."

ఇక భగవద్గీతలోని కురుక్షేత్రము, పాండవులు, కౌరవులు, మొదలగు చారిత్రక విషయములు ఈ విషయమునకు బాధకములు కావా? యను ప్రశ్నకు కూడ చక్కని వివరణము శ్రీధరాదులు చేసియున్నారు. ఈ విషయమున నీల కంఠపాదు లిట్లనున్నారు, వేదమునందు "తేషాం కురుక్షేత్రం దేవయజనమాసా . అవిముక్తంవై కురుక్షేత్రం దేవానాం దేవయజనం సర్వేషాం భూతానాం బ్రహ్మ సదనమ్" అని బహుభంగుల పొగడబడిన కురుక్షేత్రమే యిచ్చట యుద్ధ భూమిగ వ్యాసునిచే చమత్కరింప బడినది. ఈ విధముగ కర్మకాండ ప్రసిద్ధమగు కురుక్షేత్రమొకటియు, బ్రహ్మ ప్రాప్తిస్థానభూతము అవిముక్తాఖ్యము నగు కురు క్షేత్రము మఱియొకటియు గలదు. జీవరాసులకు ప్రాణోత్క్రమణ సమయమున రుద్రుడు తారకమను బ్రహ్మను చెప్పుచున్నాడు దానివలన జీవి అమృతీ కరణమును పొంది మోక్షము పొందుచున్నాడను విషయము నిచ్చట నధ్యాహారము చేసికొని వచో నిందు వర్ణింపబడినది బ్రహ్మసదనమగు కురుక్షేత్రమే కురుదేశాంతర్గతమగు కురుక్షేత్రము ధర్మక్షేత్రమేగాని బ్రహ్మసదనముగాదు. కారణమేమనగా ప్రవర్గ్య కాండయందు దానిని ధర్మక్షేత్రమనియే వ్యవహరింతురు.

సంప్రదాయ సిద్ధములగు ఈ నీలకంఠుల వాక్యముల వలన కర్మభావనకును, బ్రహ్మ భావనకును నడుమ కనిపించి, భ్రమింపజేయు కల్లోలమే యుద్ధరంగమని తెలియుచున్నది అందును వంధునకు కలిగినవారును పాండురమగు తేజోమూర్తికి కల్గినవారున వేరుగ చెప్పబడిరి. "మామకాః పాండవాశ్చైవ" యనుటలో నంధుని సంతానము మమత్వ భావము కలవారని యర్థము చెప్పబడినది. ఈ విషయమునే నీలకంఠులు "పాండవానాం పృథగ్గ్రహణం తేషు మమత్వాభావ సూచనార్థమ్" అని చెప్పియున్నారు.

ఇక నాచార్యత్రయముయొక్క వ్యాఖ్యానములు జగద్విఖ్యాతములు. ద్వైతా ద్వైత విశిష్టాద్వైత సంప్రదాయముల ననుసరించి ఈ వ్యాఖ్యలు వ్రాయబడిన

వనియును. భగవద్గీతనుండి తమతమ యభిప్రాయములనే వీరు వ్యాఖ్యానించి చూపిరనియును కొందఱు పాశ్చాత్యుల యూహ. నిజమున కీ సిద్ధాంతములు గీతకు తరువాత పుట్టిన వనియు. వారీ సిద్ధాంతముల ననుసరించి గీతకర్థము చెప్పుటకు ప్రయత్నించిరనియు గూడా వీరి యభిప్రాయము. పాశ్చాత్య మానవపుత్రులగు కొందఱు భారతీయులుగూడ నిట్లే యనుకొనుచున్నారు. ఇది కేవలము అవివేకము వలన నని సులభముగా తేల్చి చెప్పవచ్చును. కారణమేమనగా ద్వైతాద్వైత విశిష్టాద్వైత సంప్రదాయముల పేర్లు క్రొత్తవియైనను మార్గములు క్రొత్తవిగావు. ఆ మార్గముల కాయాచార్యులు ప్రవర్తకులై భగవచ్ఛబ్ద వాచ్యులైనారు. వేదసమ్మతముగాని యే మార్గమును వారు క్రొత్తగ నూహించిగాని, సమ్మతించిగాని యుండలేదు. నీలకంఠులు ప్రవచనము చేసిన గీతాసారములగు కర్మమార్గము, జ్ఞానమార్గము, ఉపాసనా మార్గము అనునవి అనాదిగా వచ్చుచున్న సిద్ధాంతములేగదా! ఇవియే ఆచార్యత్రయముయొక్క మార్గములనుట సాహసముగాదు. అందువలన గీతకు వీరందరు క్రొత్తయర్థములు చెప్పిరనుట తెలియని మాట సర్వశాస్త్ర సారమగు గీతనుండి వా రాయా మార్గములను ప్రాధాన్య వివక్షతో వ్యాఖ్యానము జేసిరనుట సమంజసము. ఈ ప్రాధాన్య వివక్షవలన నొక్కొక్కప్పు డభిప్రాయములు భేదింపవచ్చును. ఉదాహరణకు శంకర భగవత్పాదులు జీవాత్మ పరమాత్మల భేదము చెప్పుచు గీతకు వ్యాఖ్యానము చేసిరి భగవద్రామానుజులు పురుషోత్తమ ప్రాప్తి యోగములోని

"ద్వా విమౌ పురుషౌ లోకే క్షర శ్చాక్షర యేవచ।
క్షర స్సర్వాణి భూతాని కూటస్థోఽక్షర ఉచ్యతే.
ఉత్తమ పురుష స్త్వన్యః పరమాత్మేతి ఉదాహృతః.

అను శ్లోకముల ననుసరించి ప్రకృతి, జీవాత్మ, పరమాత్మల వైలక్షణ్యము పాటించుచు వ్యాఖ్యానము చేసిరి. ఇచట శంకరు లిట్లనుచున్నారు క్షరమనగా క్షణికమగు ప్రకృతి. అక్షరమనగా పరమాత్మయొక్క మాయాశక్తి వీరుకాక ఉత్తమ పురుషుడనగా శాశ్వతుడు. స్వచ్ఛస్వప్రకాశ జ్ఞానస్వరూపుడు నగు పరబ్రహ్మస్వరూపము.

ఈ శ్లోకమునకే రామానుజు లిట్లనుచున్నారు. "స్వరూపాన్యథా భావత్వమ్, స్వభావాన్యథా భావత్వమ్." క్షరమనగా జడము. అక్షరమనగా జన్మాదికము నొందుచున్న జీవి. వీనికి పైన మెలగుచుండియు వీనిలో నంతర్యామిత్వమును కలిగియుండి వీనిని తనయిచ్ఛామాత్ర జనితములైన కల్యాణగుణములుగా మెలగువాడు పురుషోత్తముడు.

దీనికే సర్. యస్ రాధాకృష్ణగారు శంకరు ననుసరించి కొంత భిన్నము, అస్పష్టమునగు వ్యాఖ్యను చేసియున్నారు.

"The soul in the everchanging Cosmos is Kshara. Akshara is the eternal spirit, unchanged and immovable, the immutable in the mutable. These two are not irreconcilable opposites, for Brahma is both one and many. The Gita exalts the conception of the personal God who combines in Himself the timeless existance." ఈ వ్యాఖ్యను చదువుటకన్న మూలమును జదివినచో నర్థము స్పష్టతర మగును. ఈ సందర్భమున తిలక్ మహాశయు డిట్లు చెప్పుచున్నాడు. "ఈ శ్లోకమున చెప్పబడిన క్షరము అక్షరము. అనునవి సాంఖ్యులు చెప్పెడి వ్యక్తము అవ్యక్తము అను వానితో సమానార్థకములు. వీనిలో క్షరమనగా గోచరమై నశించునట్టి పాంచ భౌతిక పదార్థము, కాని యింతకుముందు గీతలో నీయక్షర శబ్దము పలుమార్లు పరబ్రహ్మకే పర్యాయముగా వాడబడినది. అందువలన పురుషోత్తముని వివేకము చేయుచు నిచ్చట చెప్పబడిన అక్షరమును, పూర్వము చెప్పబడిన అక్షర పరబ్రహ్మముతో సరిచేయ గూడదు ఇది సాంఖ్యములోనిది గనుక దీని యర్థము వేరు. కొద్దిలో చెప్పవలెననినచో వ్యక్తమునకును, అవ్యక్త ప్రకృతికిని యవ్వలనున్న అక్షరబ్రహ్మము, ఇందు క్షరాక్షరులకు పరమందు చెప్పబడిన పురుషోత్తముడును ఒకటియే యనియును అదియే పరమాత్మ శబ్దవాచ్య మనియును చెప్పవలెను" ఇచ్చట చెప్పిన విషయ మంగీకృతమైనను, కాకపోయినను స్పష్టతరముగా నున్నది

ఇదే విషయమును జ్ఞానేశ్వరి భంగ్యంతరముగ చెప్పినాడు. "ఆకాశమున వెలుగుగాని, చీకటిగాని యుండునట్లు నీప్రపంచమున నిద్దరు వ్యక్తులున్నారు. వారిలో నొకడు కుంటి, గుడ్డి, చెవుడు మొదలగు లక్షణములు గలవాడు. మఱియొకడు ఈ లోపములు లేనివాడు. ఈ యిరువురు నొక తల్లిబిడ్డలు, ఇరువురు నొక్కచోటనే యుందురు అందొకనిపేరు క్షరము, రెండవవానిపేరు అక్షరము బ్రహ్మ మొదలుకొని గడ్డిపోచవఱకు చరాచరములలో నింద్రియములకు, మనస్సునకు, బుద్ధికి అందువఱకుగల పాంచభౌతిక వస్తువేదియైనను నామరూప అవస్థాశ్రయ మేదియైనను క్షరమనబడును. దీనినే క్షేత్రక్షేత్రజ్ఞ విభాగయోగమున క్షేత్రమని చెప్పినారు. అది ఆత్మయే యైనను ప్రతిబింబము మాత్రమే. సింహము నీటిలో తన ప్రతిబింబమును చూచుకొని కోపోద్దీపితమైనట్లు జీవి దీనిని చూచి యనేక భావవికారములను బొందును." ఇందలి వ్యాఖ్యానముగూర్చ అభిప్రాయభేదములమాట యెట్లున్నను [illegible]

వ్యాఖ్యాతల యభిప్రాయములు పరస్పరము భేదించినంత మాత్రమున ప్రమాదము లేదు. వీనిలో నేయభిప్రాయముసరియైనది, మూలమునకు సరిపోయినది అని చెప్పుట మాత్రము తేలిక గాదు. అట్లనుటకన్న నేయంశమును విశదీకరించుచున్నదని చూడ వలెను. భగవద్గీత మతగ్రంథము గాదు; తత్త్వ గ్రంథము. అందువలన వ్యాఖ్యానములు, ఉపన్యాసములును అర్హుడైన సాధకునకు సహాయము చేయగలవేగాని ప్రారంభదశలో నున్నవానికి గాదు. మూలగ్రంథమును యెవని జీవలక్షణమునుబట్టి వాడు దర్శింపవలసినదేగాని మఱియొక తరణోపాయము లేదు. సాధన యనునది నేర్చుకొనునది గాని నేర్పునదిగాదు స్వయంకృషి లబ్ధమైనప్పుడే యది సాధన యనిపించుకొని శాస్త్రము దర్శనమగును వ్యాఖ్యాత లెప్పుడును ధన్యులే. వారి సాధన మార్గమున నీతినాధారముగ జేసికొని వారు తరించినారు. అది లేక కేవలము క్రొత్తయర్థము చెప్పుటయే ముఖ్యముగ నుద్దేశించిన ఆధునికులలో "పతంతి పితరోహి ఏషాం లుప్త పిండోదక క్రియాః" అను వాక్యములో పితరః అను శబ్దమునకు మనలను నడిపించుచున్న పెద్దలగు రాజకీయవేత్తలనియును, పిండ శబ్దమునకు ఇడ్లీ యనియును, ఉదకశబ్దమునకు ఉష్ణోదకమగు కాఫీ యనియును రాజకీయ వేత్తలకు విందులు చేయుట మానినచో వారు ఆధారము లేక పడిపోవుదు రనియును నర్థము జెప్పిన మహానుభావులను గూడ నేనెఱుగుదును. అందువలన ఎవనికి తోచినట్లు వారర్థము చెప్పకుండుటకే గురుపరంపరయు, సంప్రదాయము, దాని ననుసరించిన వ్యాఖ్యాన వాఙ్మయము నేర్పడినవి. వ్యాఖ్యలను విడిచిపెట్టుట సరికాదు వీలైనన్ని వ్యాఖ్యలు చదివి మిగిలిన సందేహములు తీరుటకు మరల మూలమునే చదువవలయును. లోపల సర్వమును గ్రహించువాడున్నాడు గమక వాడే యంత్రారూఢముగా సమస్తమును నడుపును. ఈ విషయమునే తిలక్ మహాశయుఁడు చెప్పగా నాయన వ్యాఖ్యలను చదువవద్దనినట్లు అర్థము చేసికొని "సుందరానంద విద్యా వినోద" అను నాయన త్రిదండి గోస్వామియొక్క గీతా వ్యాఖ్య కుపోద్ఘాతము వ్రాయుచు నిందగాబలికినాడు.

మఱియొక చిన్న విషయమును చెప్పి వ్యాఖ్యానముల పరామర్శ ముగింతును. భగవద్గీతలో నర్జునుఁడు రథికుఁడు. కృష్ణుఁడు సారథి. గుఱ్ఱములు తెల్లనివి. ఈ రథముయొక్క పరమార్థము తెలియనిదే గీతనర్థము చేసికొనుటకు పునాదిలేదు. అందు వలననే,

తతః శ్వేతై ర్హయై ర్యుక్తే మహతి స్యందనే స్థితౌ
మాధవః పాండవ శ్చైవ దివ్యౌ శంఖౌ ప్రదధ్మతుః

అనువర్తనతో వ్యాసుడు రథమును యుద్ధరంగమున ప్రవేశపెట్టును ఇందలి గుఱ్ఱములు ఇంద్రియములు, రథము శరీరము, రథికుఁ డాత్మ, మనస్సు పగ్గము, పరమాత్మ సారథి. ఈ గుఱ్ఱములు తెల్లనివై (స్వచ్ఛములై) మనస్సు బిగ్గబట్టి బయలుదేరినచో పరమమైన మోక్షస్థితి లభించును. ఈ విషయమునే వ్యక్తముగా నుపనిషత్తులలో-

"ఆత్మానం రథినం విద్ధి శరీరం రథమేవచ" అనియును "తతోయాతి పరాం గతిమ్" అనియును చెప్పబడియున్నది. ఈ సారథిని గూర్చియే

"ఈశ్వర స్సర్వ భూతానాం హృద్దేశే అర్జున తిష్ఠతి
భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా"

అని చెప్పబడియున్నది. అందువలననే సమస్త ధర్మములను తెలిసిన వెనుక ఈసారథిని అనుసరించి పోగలిగిన ఉత్తమ సాధకునకు మఱియొక రహస్యము చెప్పబడినది. దానినే వైష్ణవులు చరమశ్లోకమని చెప్పుదురు. అది

సర్వధర్మాన్ పరిత్యజ్య మామేకం శరణం వ్రజ ।
అహం త్వా సర్వపాపేభ్యో మోక్షయిష్యామి మాశుచః ॥

ఈ రహస్య ముత్తమ సాధకునకు చెప్పవలసినదే గాని, పామరునకు చెప్పినచో తానుజేసిన సమస్త పాపములను భరించుటకు భగవంతుడు పాపాలభైరవుడై యున్నాడని కొన్ని పామరమతములకు చెందినవారు చెప్పుచున్నట్లు మొనగాడై విశంకుకుడగును. ఈయాద్యంతములు తిన్నగా వ్యాఖ్యానకారుల సంప్రదాయము ననుసరించి గ్రహించినచో గీతామూర్తి ప్రసన్నమగును. వ్యాఖ్యానములకు తక్కువ లేదు. రామానుజ, శంకర, మధ్వ, మధుసూదన సరస్వతి, శ్రీకంఠ, అభినవగుప్త, రంతిదేవ, నహ, గుహ, హనుమంత, మనవాళ్ళముని, పిశాచ, మొదలగు పలువు రాచార్యులు భగవద్గీతకు చక్కని వ్యాఖ్యానములు చేసియున్నారు. అధునికులలో తిలక్, అరవింద, రాధాకృష్ణ, అనిబిసెంటు, రామదాస, జ్ఞానేశ్వరి, భగనలాలు మొదలగు పలువురు వారి శక్తికొలది వ్యాఖ్యానములను వ్రాసిరి. సాధనసంపత్తిగల్గి, గీతాపఠనముజేసి వ్యాఖ్యానములను పరిశీలించి మరల గీతా జపధ్యానము చేసినచో జీవి ధనుర్ధరుడగు యర్జునుడై, లోన సారథి లక్ష్యమును చూపువాడై నిలబడుట జరుగును. అట్లు నిలబడినచోట సంపద, విజయము, వైభవము, ధ్రువముగ నిలుచునని పంజయులు చెప్పియున్నారు గదా:

యత్ర యోగీశ్వరః కృష్ణో యత్ర పార్థో ధనుర్ధరః ।
తత్ర శ్రీ ర్విజయో భూతి ర్ధ్రువా నీతి ర్మతి ర్మమ॥

హరిః ఓం శాంతి శ్శాంతి శ్శాంతిః



కవిత :

# అవ్యక్త వేదన

శ్రీ పెండ్యాల చిన రాఘవరావు
'రాజశ్రీ'

నిండు పున్నమ రేయి
పండు వెన్నెల హాయి
నాలోన ఏవొ, క
ల్లోలాలు రేపె :

కొండ కోనల నీరు
పిండి, జాలుగ పారు
సెలయేటి కలస్వనము
చెవుల కెటులో దోచె :

చల్ల చల్లని గాలి
మెల్ల మెల్లన వీవ
ఉలికిపడి నా మేను
జలదరించె నిదేలొ :

కొమ్మ కోనల, కోకి
లమ్మ 'కూకూ' రవము
కమ్మని స్మృతు లేవొ
కల్పించె నా హృదిలొ :

మావిగున్నల, లేత
మారాకులను జూచి
మనసులో ఇటులేలొ
మమత లుప్పొంగేను :

కోటి తారల వెలుగు
మూటగట్టిన మొయిలు
ఏటికో నా కనుల
కెంతొ వింతగ దోచె :

రమణీయమౌ ప్రకృతి
కమనీయ దృశ్యాలు
అవ్యక్తమగు నేవొ
ఆలోచనల రేపె :
ఆరాటముల రేపె ::
ఆవేదనల రేపె ::



పుస్తక పరిచయం :

( సమీక్షకుగాను రెండు ప్రతులు పంపవలెను—సంపా. )

# జీవనరంగం

మొదటి భాగము

[ఎనిమిది ఏకాంక దృశ్యనాటికలు]

పుటలు 140 వెల : రు. 1-12-0

ప్రచురణ : దేశోద్ధారక గ్రంథమాల, హైదరాబాద్.

ఇందు మల్లిఖార్జున్, ధరణికోట శ్రీనివాసులు, పొట్లపల్లి రామారావు, పోతుకూచి సాంబశివరావు, వట్టికోట ఆళ్వారుస్వామి, వల్లా దుర్గయ్య, కె. నారాయణరెడ్డి, దివాకర్ల వేంకటావధానిగార్ల నాటికలు పేకరించారు. వీరందరూ సాహిత్య క్షేత్రంలో కృషిచేస్తూ ఇతర రంగాలలో చేయితిరిగినవారే నాటికలు రచియించడం వీరిలో చాలమందికి ప్రథమ ప్రయత్నంలాగు కనిపిస్తోంది. 'నాటకాంతం హి సాహిత్యం' అన్నట్లు అన్నీ కూలంకషంగా పరిచూచి నాటక సాహిత్యంలో పూర్వులు ప్రవేశించే వారట. ఒక్కొక్క నాటికకు ముందు రచయితను పరిచయంచేసే ఛాయాచిత్రంతోపాటు వాక్చిత్రం కూడా చేర్చారు ఈ రచయితలు పుట్టిన తేదీలు చూస్తే అందరూ యువకులే అని తెలుస్తుంది తొలినాటిక సంఘర్షణలో మల్లిఖార్జున్ లలిత కళలయిన కవిత్వం, సంగీతం, నృత్యం, శిల్పం, చిత్రలేఖనం వీటిని పాత్రలుగా ప్రవేశపెట్టి వాటిచేత వాగ్వాదం చేయించి, వీరి వాగ్వాదాల మీద తీర్పు 'రసం' చేత చెప్పించి యీ భరత వాక్యంతో ముగింపు చేశాడు.

నిరుపేదల జీవన సాధనలో
నిరూపించి మీ సామర్థ్యం
చీకటి కుటిలో వెల్గుల నింపుడు
చేకూర్చుం డిక ఆనందం

అని ఛందోబద్ధంగా నడచిన యీనాటికలో విషయ నవ్యత తప్ప విశేషంలేదు. రెండవనాటిక "తారుమారు"లో ధరణికోట శ్రీనివాసులుగారు ఒక సాంఘిక కథ తీసుకున్నారు. పెళ్లి చూపులకి వచ్చిన వరుడు 'మురళి' దేవకిని చూచి అమ్మాయి వచ్చిందంటాడు. పెళ్లికూతురు మాత్రం తనకి వరుడు వచ్చలేదనడంతో "తారుమారు" అవుతుంది, ఇదే యితివృత్తం ఒక ప్రసిద్ధ నాటికగా ఆంధ్రదేశంలో

చాల చోట్ల ప్రదర్శనపొంది బహుమతు లందుకొన్నది. విషయంలోగాని సంభాషణల్లోగాని ఇందులో విశిష్టత కనిపించదు. వీరు అనేక నాటికలు రచించి ఉండటంవల్ల నాటికను నడిపించే నేర్పు కొంతవరకు నేర్చుకున్నారు.

'వగ' అనే నాటికలో పాలకులు ప్రజల్ని పెట్టే హింసలూ, ఆపాలకుల్ని తప్పించుకోవడానికి ప్రజానాయకులు పడేపాట్లు వర్ణిస్తూ చివర పోలీసుల కండ్లలో కారంజల్లి పరారిఅయిన ప్రజాసేవకుని చర్యతో చమత్కారంగా హాస్యరసాన్ని వేశంతో పూర్తిచేశారు ఈ రచయిత పొట్లపల్లి రామారావుగా రనేక నాటికలు పిల్లలకు వ్రాసినవారే అందుచేత ఇది సమర్థతతో నిర్వహించారు. రంగస్థలంమీద ఇది బాగా రక్తి కట్టుంది కూడా: ఇంతకంటె రంగస్థలానికి అనువుగా హాస్య ప్రధానంగా రచించిన నాటిక "ఏడుసున్నలు". ఇందు పాత్రలు భవం, భారం, ఇహం, పరం, శూన్యం, శవం, శివం ఆరుగురు విద్యార్థులు. పరీక్షల్లో కొత్తగా సున్నాలు చుట్టినవాడు శివం, శవం తండ్రికొడుకులు శవం పరీక్ష తప్పిన కారణం చేత 'శవాన్ని' ఏమైనా చేస్తాడేమోనని భయంచేత మిగిలిన స్నేహితులు పన్నాగం పన్ని రకరకాల వేషాలువేసి 'శవం' నిజానికి ప్రయోజకుడే అని రుజువుచేసి 'శివం' గారి కటాక్షం సంపాదిస్తారు ఇందులో పన్నివేశాలన్నీ అసహజంగా ఉన్నప్పటికీ హాస్యప్రధానం అవడంచేత అంగీకరించ వచ్చు.

"కనువిప్పు" అనే నాటికలో చదువుకొన్న భార్యలే కావాలనే ఆధునిక యువకులు వీరయ్య, రఘులు అనే వారిని చూపించి వీరిమధ్య యీ సమస్యపెట్టి చదువు లేకపోయినప్పటికీ సర్వలక్షణ సంపన్న అయిన వధువును పెండ్లిచేసుకోవ డంలో తప్పులేదని నిరూపిస్తారు ఈ నాటికలో ప్రచారం ప్రధానంగా పెట్టిన కారణంచేత కళ కొంచెం లోపించింది సంభాషణల్లో సహజత్వం చూపడంలో యీ రచయిత వట్టికోట ఆళ్వారుస్వామిగారు తమనేర్పు నిల్పుకొన్నారు.

"మాయరోగం" అనే నాటికలో 'శ్యాం' అనే యువకుడు తాను ప్రేమిం చిన సహాధ్యాయిని ఒక యువక వితంతువుకోసం మాయరోగం నటించి తన సహాధ్యాయులయిన యిద్దరి యువకుల సహాయంచేత తండ్రిని ఒప్పించి తనకార్యం సాధిస్తాడు. దీనికి మధ్య ఒక సిద్ధాంతి, జ్యోతిషం మొదలయినవి వస్తాయి. ఇదే ఇతి వృత్తాన్ని 'మోలియర్' చక్కని నాటికగా వ్రాశాడు. ఇందులో కథానిర్మాణం గాని పాత్రలుగాని సంభాషణలుగాని ఏమీ ప్రయోజనకారులుగాలేవు. ఈ రచయిత

"మధ్యవర్తి" నాటికలు కమమతరెడ్డి నారాయణరెడ్డిగారు రైతుల్లో పెద్దరికం వహించే 'మధ్యవర్తి' తీర్పరుల అన్యాయానికి యెదురు తిరిగిన రైతుల సాహసాన్ని వారి స్వాభావిక వచన ధోరణిలో చక్కగా వర్ణించారు. స్త్రీ పాత్రలేని ఈ నాటిక గ్రామసీమల్లో బహిరంగ స్థలాల్లో ప్రదర్శిస్తే చక్కగా ఉంటుంది.

"అనుమానం" అనే నాటికకు ఇతివృత్తం కాకతీయులనాటి చరిత్రలో రుద్రమాంబకి సంబంధించిన కట్టుకథ; మార్గమధ్యంలో దొంగలు కొట్టిన ఒక పుణ్యస్త్రీని రక్షించిన ఆగంతుకుని చూచి అనుమానంతో తన భార్య శీలాన్ని ఒక యువకుడు శంకిస్తాడు నిజానికి ఆగంతుకుడు పురుషవేషంలో ఉన్న రుద్రమాంబ అని తెలుస్తుంది. ఈ నాటిక రచించన దివాకర్ల వేంకటావధానిగారు కథా సంవిధానానికిచ్చిన ప్రాధాన్యం నాటకీయత కివ్వలేదు మొత్తంమీద 'జీవనరంగం'లో నాటికలన్నీ ప్రత్యేక ప్రయోజనాలకోసం వ్రాసినవి. రంగస్థలంమీద రక్తికడ్తాయి. ఏకాంకదృశ్య కావ్యాల అవసరం ఎంతయినా ఉన్న యీ కాలంలో ఇది ప్రజాదరణ పొందగలదని ఆశించవచ్చును.

## జీవనరంగం

రెండవ భాగము

[ఏడు ఏకాంక దృశ్యనాటికలు]

పుటలు 115 వెల రు. 1–12–0

ప్రచురణ : దేశోద్ధారక గ్రంథమాల, హైదరాబాదు.

ఈ రచయితలందరూ కథకులుగా, కవులుగా, విమర్శకులుగా ఆంధ్ర పాఠక లోకానికి పరిచితులయినవారే; కాని వీరందరూ నాటికా రచనలో ఆరితేరినవారు కారని యీ నాటికలు చెప్పక చెప్పుచున్నవి. నాటికలో కావలసినవి పాత్రచిత్రణ, సంభాషణారచన, నాటక సంవిధానం, వస్తువులోని ఐక్యత. ఆయా పాత్రలచేత మాటలాడించేటప్పుడు వారిలో కవివాణి వినిపించకూడదు. ఆ నేర్పు లేనప్పుడు నాటిక వ్రాయడం నిష్ప్రయోజనం. కథాసంవిధానంలోను, పాత్ర పోషణలోనూ ఔచిత్యాన్ని పాటిస్తూ తదనుగుణమైన శైలిలోనే నాటికరచన సాగించడం ముఖ్యావసరం. వీటన్నిటికంటె నాటిక ప్రప్రథమ ప్రయోజనం రంగస్థల ప్రదర్శన అనేది మరవకూడదు. [illegible]

కొద్దిః మొదటినాటిక 'అరగంటలో అదృష్టం' రచించిన వి. ఆర్. కృష్ణ నాటకానుభవం కలవారు. అందుచేతనే యిందులో రంగస్థలానుగుణ్యమైన సన్నివేశాలు సమకూర్చారు. ఒక స్త్రీపాత్రకూడా లేని యీ నాటికలో ఇతివృత్తం— జ్యోతిషమూ పక్షిల్నూ నమ్మిన ఒక వృద్ధపంతులు మానసిక పరివర్తన అరగంటలో అదృష్టం వస్తుందని చెప్పిన జ్యోస్యం నమ్మి ఆత్రుతతో అదృష్టంకోసం ఎదురుచూస్తే అనుకోని తంతివార్త చూచి ఆశాభంగంతో అసువులు విడుస్తాడు. మరుక్షణంలో ఆ యదృష్టం వచ్చినట్టు తంతివార్త వస్తుంది. నాటికలో సన్నివేశాలు కృత్రిమంగా ఉన్నప్పటికీ—రచయిత నేర్పువల్ల స్వాభావికంగానే చిత్రించాడు.

రెండవనాటిక 'మహాశ్వేత' కాదంబరిలోని ఒక చిన్న ఉదంతాన్ని ఆధారంగా చేసుకొని కవి దాశరథి అల్లిన ఊహాకల్పన. ఇందులో కవితా చమత్కృతికిచ్చిన ప్రాధాన్యం నాటకీయత కీయలేదు. ఆయా పాత్రల సంభాషణల్లో ఆ పాత్రిలూ సన్నివేశాలు బదులు దాశరథి కనిపిస్తున్నాడు. మూడవనాటిక పట్నవాస మర్యాదలోకూడా ఇంతే. ఇది వ్రాసినవారు ఇల్లిందల సరస్వతీదేవి. ఈమె కథకురాలుగా వ్యాసకర్త్రిగా పరిచితురాలు. ఈ నాటికలో యీమె తీసుకొన్న వస్తువు పట్నవాసపు సంసారాల కష్టాలజీవనం. అతిథివస్తే వాళ్ళెంత నిర్దయ వహించవలసి ఉంటుందో చూపటానికి ప్రయత్నించారు. నాటకరంగాల విభజనలో కథానికా సంవిధానాన్ని అనుసరించారుకాని నాటికాపద్ధతి చూడలేము. డాక్టరుయజ్ఞం అనే నాటికలో— రచనాపద్ధతి చక్కగానే ఉంది. కాని యిందులో పాత్రలు కన్యాశుల్కంలోని గిరీశాన్ని మనస్సులో పెట్టుకొని కల్పించినట్టు కనిపిస్తాయి. అయితే గిరీశం పాత్రలోని ఉదాత్తతగాని, పరిణతికాని లేదు చీటికీమాటికీ ఇంగ్లీషులో మాటలాడే యజ్ఞం, పూడి అనే పాత్రలు ఆహార పరిశోధన అనే మిషతో లోకాన్ని మోసగించబోయి తామే మోసంలోపడతారు ఈ నాటిక రచయిత భాగి నారాయణమూర్తిగారికి నాటికారచన తెలిసినట్టే ఉంది అందుకే యీ నాటిక ఎంత కృత్రిమ సంఘటనలతోఉన్నా ప్రదర్శనయోగ్యం అని ఒప్పుకొని తీరాలి

పీతి నియమావళి అనే నాటికలో చిదంబరం అనే బడిపంతులు ఉపాధ్యాయ పదవిలోకూడా లంచాలకు పాలుపడి ఆ పనికి శిక్ష పొందడానికిబదులు అవినీతి నిర్మూలనా పదవికి ప్రమోషన్ పొందిన విధానం నిరూపించడం జరిగింది. ఈ రచయిత శతావధాని యస్. వి. యస్. వేంకటాచార్యులుగారికి నాటికారచనలో [illegible]

వర్ణాలుగు పాత్రలవరకు పదిహేను నిమిషాల నాటికలో ప్రవేశపెట్టి ఏ పాత్రకు తగిన ప్రయోజనంలేకుండా చేశారు.

మిష్టర్ రావు అనే మరోనాటికలో ఒక బడాయికోరు తెలిసిన పెద్దమనిషిని భోజనానికిపిలిచి, యింట్లో యేమీలా లేక అతన్ని త్రిప్పి పంపించివేసిన సందర్భం చిత్రించారు ఈ నాటికారచన బాగానే నడిచినప్పటికీ ప్రధానపాత్రచేత స్వగతాలు చెప్పించడం బాగాలేదు. ఈ సుదీర్ఘస్వగతం లేకపోయినప్పటికీ నాటికలో లోపంలేదు.

చివరినాటిక 'గోకుల విహారి' నృత్యనాటిక రంగస్థలం మీదగాని, సంగీత నాటికగా రేడియోలోగాని ప్రదర్శించడానికి అనువుగా ఉంటుంది. ఈ నాటిక ఇతివృత్తం పోతనామాత్యుడి భాగవతంలో దశమస్కంధ భాగంలోనుండి తీసు కొన్నదని కవి పి. నారాయణరెడ్డి స్వీకరించారు రాధమురా, కలకాలం విలుచు ప్రేమగాధనురా, గాయపడిన వలపుగుండె బాధనురా -వంటిప్రాసలు చక్కగా కూర్చ పేర్చినవారు. మాటల సొంపుతోపాటు విషయ చమత్కృతికూడాఉంచే ఈ నాటిక యింకా బాగా రక్తికట్టేది.

మొత్తంమీద యీ నాటికలన్నీ సంపుటాలుగా వెలువడిన కారణంచేత, తెనుగునాట ఈనాడు దినదిన ప్రవర్ధమానమవుతూవున్న నాటక కళాప్రోత్సాహానికి తోడ్పడుతున్నాయి. వివిధ కళాశాలలు, యువజనసంఘాలు, సారస్వత సమితులూ అమెచ్యూర్ నాటికలు ప్రదర్శించాలని కుతూహలం కనబరుస్తున్నాయి కాని వాటికి తగిన మంచి నాటికలు సేకరించలేక పోతున్నాయి ఈ కొఱత తీర్చడానికి, 'జీవనరంగం' వంటి నాటికా సంపుటాలు ఎన్ని వచ్చినా స్వాగత మీయవలసిందే!

'శ్రీవాత్సవ'

# కర్పూర ద్వీప యాత్ర

## (పిల్లల నవల)

రచయిత శ్రీ నోరి నరసింహశాస్త్రి

వెల రు 1–4–0 సాహితీసమితి—రేపల్లె (గుంటూరుజిల్లా)

"కర్పూర ద్వీపమనేపేరు మీకు.కొత్తగా ఉన్నదేమోకాని జ్ఞానమంతా తిరిగింద్ది అది. కొంతమంది దాన్ని నేత దీవమన్నారు. కొంతమంది శివగిర

మన్నారు కొంతమంది కైలాసమన్నారు. మరికొంతమంది బ్రహ్మలోకమన్నారు. ఏమన్నా ఒకటే. అసలు మనమంతా ఆ కర్పూరద్వీపంలో ఉండే ఆది దంపతుల పిల్లలమే" అని శ్రీ నరసింహశాస్త్రిగారు పుస్తకాన్ని ముగించారు.

నృసింహ పురాణంలో "ఆదియు మహిమయు నేర్పర నాదిపురుషు డొకడ యెఱుగ నన్యుల కెఱుఁగంగా దరముగాదు కమలభవాది దివిజవంద్య మది మహాద్భుతము మహిన్" అని శ్వేత ద్వీపం వర్ణింపబడింది. ఆ వర్ణన హృదయానికి హత్తుకోగా శ్రీ శాస్త్రిగారు కర్పూరద్వీపాన్ని సృష్టించారు.

శ్రీ నోరి నరసింహశాస్త్రిగారు సాహితీలోకానికి సుపరిచితులు. నవ్యసాహిత్యోద్యమ కర్తలలో ఒకరు. ప్రముఖులు.

ఈ నవల 12 సంవత్సరాల వయస్సుగల పిల్లలకోసం వ్రాయబడ్డది. అటువంటి పిల్లలు వింటూ ఉండగా వారి కెంతవరకు అర్థమవుతున్నదో తెలుసుకొంటూ ఈ నవలను రచించానని శ్రీ శాస్త్రిగారు తెలియజేస్తున్నారు. గహనమైన విషయాన్ని సులభశైలిలో పిల్లలకందరికీ అర్థమయ్యేటట్లుగా రూపొందించిన శ్రీ శాస్త్రిగారి ప్రతిభ అనన్యమైనది.

"కర్పూరద్వీపానికి ఒక నావ వస్తుంది. దానిపైన నలుగురు జంటపిల్లలు నెమిళ్లై, రాజహంసలై, చిలుకలై, కోకిలలై ఎక్కి ప్రయాణం చేస్తారు. ఈలోకానికి చేరుకుంటారు కొంత పుణ్యమూ, కొంత పాపమూగూడా చేస్తారు. ఆ కొద్దిపాపం అనుభవించడానికి నరకలోకంలోనికి పోతారు. నరకంలో పాప విముక్తినిపొంది ఆకాశ గంగలో స్నానంచేసి దివ్యదేహాలు ధరించి స్వర్గం చేరుకొంటారు. కొంతకాలానికి ఈలోకం చాలా కష్టంలో ఉండడంచూచి, జాలిపడి అష్టవసువులైన ఆ ఎనిమిదిమందీ మానవరూపంధరించి తిరిగి ఈ లోకంలోనికి వస్తారు. ఈ లోకాన్ని "మధురమూ, సుందరమూ, సన్మార్గ ప్రచలితమూ" చేసి ఈ లోకమే స్వర్గంకంటే మేలనిపించేటట్లు చేస్తారు. చివరకు సూర్యమండలం మధ్యగుండా ఒకరూ, చంద్రమండలం మీదుగా మిగిలిన ఏడుగురూ కర్పూరద్వీపం చేరుకొంటారు. ఆకాశంలో నక్షత్రాలనడుమ కాంతిమేఘంవలె కనుపించే కర్పూరద్వీప వర్ణనతో కథ ముగుస్తుంది.

"మన స్వరూపం మనం తెలుసుకొంటే మనమెక్కడఉంటే అదే కర్పూరద్వీప మవుతుం" దని నవలకు కర్పూర నీరాజనం సమర్పింపబడింది.

శ్రీ శాస్త్రిగారు ఈ నవలను ఒక కావ్యంగా చిత్రించారు. నవలలో ప్రసన్నతా, ఉదాత్తతా తొణికిసలాడుతున్నవి. కథావస్తువులోనూ, భాషలోనూ, భావ వ్యక్తీకరణంలోనూ నైర్మల్యం ఎక్కడికక్కడ వ్యక్తమవుతున్నది రాజహంసల నడకలు, మయూరవర్ణ వైచిత్ర్యం. చిలుకల ముద్దుపలుకులు, కోకిలల కుహూకుహూ వాదాలు పాఠకులను ముగ్ధులను చేస్తున్నవి.

వర్ణనలు చేసేటప్పుడు శాస్త్రిగారు పిల్లలకు బోధపడే ఉపమానాలనే విరివిగా గ్రహిస్తూ మధ్యమధ్య ఒక్కొక్క గంభీర విషయాన్నిగూడా ఉపమానంగా గ్రహించారు. ఉదాహరణకు మానస సరోవరంలో ఏదో చిన్న చప్పుడైందని వర్ణిస్తూ మద్దెల వాయించేటప్పుడువేసే ముక్తాయింపులాంటిది, తాళముగావేసే చిటికలాంటిది అంటూ మధ్య "యోగులు మూలాధారచక్రంలోనుండి కుండలినీ శక్తిని లేవదీసే టప్పుడు వినబడే ధ్వనిలాంటిది" అని వర్ణిస్తారు. నాలుగు తెలిసిన ఉపమానాలమధ్య ఒకటి తెలియనిది వచ్చినా కథాగమనానికి యిబ్బంది ఉండదు.

భారతీయ సంస్కృతియెడల శ్రీ శాస్త్రిగారికిగల గౌరవం ఆంధ్ర దేశంపై ఆంధ్రభాషపై వారికున్న అమితమైనప్రేమ ఈ నవలలో మన కడుగడుగున గోచరిస్తుంటాయి.

పాశ్చాత్య నాగరికతపై తమకున్న కోపమంతా తీరేటట్లుగా శాస్త్రిగారు "అర్థాలు కామాలు పెంచుకొని దుక్క బలిశా"రని పాశ్చాత్య నాగరికతను తిట్టి పోశారు కొన్ని కొన్నిచోట్ల సామాన్య పాఠకులు వీరిభావాలతో ఏకీభవించడం కష్టమనిగూడా అనిపిస్తుంటుంది.

శ్రీ శాస్త్రిగారు నరకాన్ని గురించిగూడా నవలలో విపులంగా వర్ణించారు. ఇంత సుదీర్ఘములైన నరకయాతనల వర్ణనకు పిల్లల కోమల హృదయాలు తట్టుకో లేవేమో!! ఈ నవలలో ఈ భాగం లేకుంటేనే బాగుండేది. ఉన్నా ఏదో కొద్దిగా వర్ణింపబడితే బాగా ఉండేది.

ఈ పుస్తకం ఇంకా అందంగా ముద్రణ కావాలి. చక్కని ముఖచిత్రం, మంచి కాగితం, మంచి అచ్చు, మంచి చిత్రాలతో పుస్తకం అచ్చు కావాలి.

బాల సాహిత్యంలో కర్పూరద్వీపయాత్ర ఉత్తమమైన కృతి.

స్వచ్ఛమైన కర్పూర వాసనల గుబాళింపుచేత ఆకర్షింపబడి బాల బాలికలూ పెద్దలూగూడా ఈ నవలను చదివి ఆనందింతురుగాక.

—తిరుపుటూరి రాఘవాచార్యులు.

గేయం:

# ప్రేమతత్వం

— శ్రీ జయంతి

అందం, ఆ
శ్లేషించిన
హృదయాన్నే
దూసుకొపోయె–
అనురాగపు
పిపాసయే
శ్రుతికలియని
స్వరమయ్యెను–
ఆరాధన
మొనరించిన
దవరోధం
కల్పించెను–
ఆనందం
అందనిదై
యెడమౌతూ
దిగులొందెను–
యవ్వనమే
నవ్వలేక
పలవిస్తూ
పాలిపోయె–
ఆవేదన
ఉపశమింపక
ఉప్పొంగిన;
ప్రేమతత్వ
ప్రణతి యేదో ?

ప్రేమించిన
ఫలియించిన
అమృతపాత్ర
మౌను ప్రేమ;
విఫలమైన
విషపాత్రగ
రూపొందును–
విషమించిన
ప్రేమలోన
బ్రతికించెడి
జీవ మేదో ?
రాగద్వేష
లయమైనది
ప్రేమెందును
గ్రుడ్డిదియై
ప్రేమకున్న
స్వభావమే
ద్వంద్వభావ
స్పందనమా–
చిగుర్పుటో
ప్రమోదపుటో
ప్రేమపాశ
స్పర్శవుటే.

# హైదరాబాదు హిందీ ప్రచార సంఘం
# సర్వసభ్య సమావేశం



గడచిన మేనెల 22 వ తేదీ సాయంత్రం గం. 5-30 లకు హిందీ ప్రచార సంఘ కార్యాలయ భవనంలో హిందీ ప్రచారసంఘ సర్వసభ్య సమావేశం జరిగెను. శ్రీ స్వామీ రామానంద తీర్థగారు సమావేశానికి అధ్యక్షత వహించిరి. అధ్యక్షునికి ఒకవైపున దక్షిణ భారత హిందీ ప్రచారసభ ఉపాధ్యక్షులు, హైదరాబాదు ముఖ్య మంత్రి గౌ. బూరుగుల రామకృష్ణరావుగారూ, ఇంకొకవైపున దక్షిణ భారత హిందీప్రచారసభ ప్రధాన కార్యదర్శి శ్రీ మోటూరి సత్యనారాయణ, గౌ. జి. యస్. మేల్‌కోటేగారలూ ఆసీనులైరి ప్రముఖులు అనేకమంది సమావేశానికి హాజరైరి. కార్యాలయ భవనం త్రివర్ణ పతాకాలతోనూ, మామిడి తోరణాలతోనూ అందంగా అలంకరించ బడెను. మహాత్ముని ఆశీర్వాద బలంతో దాదాపు 37 సంవత్సరాలుగా దక్షిణ దేశంలో హిందీ ప్రచారాన్ని నడిపిస్తున్న దక్షిణ భారత హిందీ ప్రచారసభ కార్యవర్గం క్రిందటి మార్చి నెలలో ఆంధ్ర, తమిళ, కేరళ, కర్ణాటక శాఖలకు వలెనే హైదరాబాదు శాఖకు గూడా స్వతంత్ర ప్రతిపత్తి నొసంగడానికి నిర్ణయం చేసింది. ఆ నిర్ణయ ఫలితమే ఈ సమావేశం. నియమావళి ప్రకారం స్వతంత్ర ప్రతిపత్తిని పొందడానికి సంవత్సరం చందా రు. 10-0-0 లు యిచ్చేవారు 50 మంది సభ్యులున్నా చాలును. అయినా హైదరాబాదులోని హిందీ అభిమానులు 140 మంది సభ్యులుగాచేరి తమకుగల హిందీ భాషాభిమానాన్ని వెల్లడించారు. దాదాపు స్టేటులోని అన్ని జిల్లాల ప్రతినిధులూ సమావేశంలో పాల్గొన్నారు.

శ్రీ స్వామీజీ తమ ప్రారంభోపన్యాసంలో సంఘం యాజమాన్యాన హైదరాబాదులో జరిగిన హిందీ ప్రచార వివరాలను తెలియజేసిరి. ఈ సంఘానికి స్వతంత్ర ప్రతిపత్తి నిచ్చుటకు నిర్ణయించిన కేంద్రసభ కార్యవర్గంవారికి తమ ధన్యవాదాల నర్పించిరి.

సంఘకార్యదర్శి శ్రీ వేమూరి ఆంజనేయ శర్మగారు సంఘకార్య నివేదికను చదివి వినిపించిరి.

శ్రీ మోటూరి సత్యనారాయణగారు దక్షిణ భారత హిందీ ప్రచారసభ దక్షిణ దేశంలో జరిపిన హిందీ ప్రచార వివరాలను సంక్షేపంగా తెలియ జేసిరి. తమిళ దేశంలో నడుస్తున్న హిందీ వ్యతిరేక స్వరూపాన్ని తెలియజేస్తూ దక్షిణదేశంలో తమిళనాడులో గూడా హిందీభాష యెడల ఏవగింపు లేదన్నారు. ఈనాడు తమిళ దేశంలో వెయ్యిమంది హిందీ కార్యకర్తలు పనిజేస్తున్నారనీ, ఆ ప్రాంతంలో హిందీ ప్రచారానికి వెచ్చింపబడుతున్న ధనాన్ని అంతనూ తమిళ సోదరులే యిస్తున్నారనీ అన్నారు ఉత్తర దేశంలోనుండి హిందీ అతివాదులు అప్పుడప్పుడు వారికి తోచినట్లల్లా మాట్లాడుతూ ఉంటే, వారి మాటల వలన బయలుదేరే నందే హాలు హిందీ వ్యతిరేకోద్యమానికి దోహదం చేస్తున్నవని అన్నారు. హైద్రాబాదు రాజ్యంలో ప్రజలూ, ప్రభుత్వమూ అత్యుత్సాహంతో హిందీ ప్రచారానికి తోడ్పడు తున్నందులకు తమ సంతోషాన్ని ప్రకటిస్తూ సంఘానికి ఆర్థిక సహాయం చేస్తున్న హైద్రాబాదు ప్రభుత్వంవారికి తమ అభివందనాలను తెలియ జేసిరి.

ముఖ్యమంత్రి శ్రీ రామకృష్ణరావుగారు స్వతంత్ర ప్రతిపత్తిని పొందుతున్న హైదరాబాదు హిందీ ప్రచార సంఘాన్ని కేంద్రసభ పక్షమున ఆశీర్వదించిరి. దక్షిణ దేశస్థులు హిందీ నేర్వకపోతే ఉత్తరాది వారికంటే వెనకబడిపోగలరని హెచ్చ రించిరి ఉత్తర దేశంలోని హిందీ వాదులకు భాషా సమస్యలోని చిక్కులు అర్థం కావడం లేదనీ, వారిలో ఉదారత బొత్తిగా లోపిస్తున్నట్లే కనబడుతున్నదనీ ఏవిషయంలోనైనా "అతి"గా వ్యవహరిస్తే అది చెడు ఫలితాలకు దారి తీయగలదని అనిరి. కేంద్ర ప్రభుత్వం వారిచే నియమింపబడనున్న హిందీ కమీషన్‌వారు అన్ని విషయాలనూ గమనించి దేశానికి సరియైన మార్గాన్ని చూపించగలరనిరి.

హైదరాబాదు ప్రభుత్వం హిందీ ప్రచారానికి ఇతోధికంగా తోడ్పడగలదనిరి. ప్రస్తుతం హైదరాబాదులో పనిచేస్తున్న హైదరాబాదు హిందీ ప్రచారకసంఘము, హైదరాబాదు రాజ్య హిందీ ప్రచారసభ ఈ రెండింటికీ హైదరాబాదు ప్రభుత్వం నుండి సంఘానికి రు. 15000-0-0 లు, సభకు 18000-0-0 లు గ్రాంటుగా యివ్వ గల మనిరి. రెండు సంస్థలూ హిందీ వ్యాప్తికి పనిచేస్తున్నవనీ, ఈ రెండింటిలో హిందీ ప్రచారసంఘం మాతృభాషలను కూడదీసుకొని నడుస్తున్నదనీ, ఈసంస్థ లోని ప్రత్యేక విశిష్టత ఇదేననీ అనిరి.

మహారాష్ట్ర రాష్ట్ర భాషానభ కార్యదర్శి శ్రీ గో. ప. నేనేగారు తమ సంస్థ పక్షమున హైదరాబాదు హిందీ ప్రచార సంఘమునకు తమ శుభాకాంక్షల నందజేసిరి.

ఈ క్రింది కార్యనిర్వాహక వర్గం ఏకగ్రీవంగా ఎన్నుకొన బడెను.

అధ్యక్షులు : శ్రీ స్వామి రామానందతీర్థగారు

ఉపాధ్యక్షులు : శ్రీ గౌ॥ డా. జి. యస్. మేల్ కోటేగారు

శ్రీ గౌ॥ డా. యం. చెన్నారెడ్డిగారు

కార్యదర్శి : శ్రీ వేమూరి ఆంజనేయశర్మగారు

సభ్యులు : శ్రీ జె. వి. నరసింగరావుగారు

(అధ్యక్షులు, హైదరాబాద్ ప్రదేశ్ కాంగ్రెసు)

,, వల్లూర్ల హనుమంతరావుగారు

(ఉపమంత్రి — రెవిన్యూ)

,, బొమ్మకంటి సత్యనారాయణరావుగారు

(అధ్యక్షులు, జిల్లా కాంగ్రెసు సంఘము, ఖమ్మంమెట్టు)

,, యం. బి. గౌతమ్‌గారు, యం. ఎల్. ఏ.

(కార్యదర్శి, హరిజన సేవకసంఘము)

,, వరదా రంగారావుగారు, బి.ఏ.బి.ఎల్.

(హనుమకొండ)

,, దేవీసింగ్ చౌహాన్‌గారు

(మాజీ విద్యాశాఖామాత్యులు)

,, ఆర్. యం. జోషీగారు, యం ఎ

,, వినాయకరావు చారరాడ్‌కర్, బి.ఎ బి.ఎల్.

,, యస్. ఆర్. దేశపాండేగారు

,, పంపన గౌడగారు

(డిప్యూటీస్పీకర్, హైదరాబాద్ అసెంబ్లి)

,, డాక్టరు ఆర్యేంద్ర శర్మగారు, యం.ఎ.

,, జె. కె. ప్రాణేశాచార్యగారు, యం.ఎల్.ఎ.

,, పండిత నరేంద్రగారు, యం.ఎల్.ఎ.

,, చంద్రశేఖరపాటిల్‌గారు, యం.ఎల్.ఎ.

,, రామకృష్ణజీ ధూత్‌గారు

,, బంకటలాల్ జీ బద్రూకాగారు

శ్రీమతి ప్రఫుల్లాతాయి దేశముఖ్‌గారు

రామకృష్ణధూత్‌గారి ధన్యవాదాలతో సమావేశం ముగిసెను.



# హిందీ సంఘ కార్యకర్తలు



శ్రీ సోమనాథ్, సంగరకులు, గుల్బర్గా,



శ్రీ తేజనారాయణలాల్,
ప్రధానాధ్యాపకులు
హిందీ ప్రచారక విద్యాలయం
హైదరాబాదు



శ్రీ గుంటుపల్లి రాజగోపాలం,
సూర్యాపేట



శ్రీ రాజేంద్ర ప్రసాద్,
అధ్యక్షులు
ద భా హిందీ ప్రచార సభ



శ్రీ సత్యనారాయణగారు,
ప్రధాన కార్యదర్శి,
ద భా హిందీ ప్రచార సభ

Edited Printed and Published by V Anjaneya Sharma, 327 Residency Road
Title Printed at The Modern Printing House 51 Jambagh Road Hyd-Dn